జిడ్డుకృష్ణమూర్తి అవగాహన - 3వ సంపుటి

# ప్రజ్ఞా పుష్పం

రచన - సేకరణ - తర్జుమా

జె. శ్రీ రఘుపతిరావు

B.E., F.I.E., M.A.,(Engl.), M.A.(Socl.), DIPDE.

ప్రచురణ

జనశ్రుతి పబ్లికేషన్స్

తిరుపతి

**Janasruti publication No.4**

Jiddu Krishnamurti Avagahana - 3rd Volume

(Pragna Pushpam- Flower of Intelligence)

By

J.S.RAGHUPATHI RAO

15-79 Padmavati nagar

Tirupati-517502 (0877-2240827)

1000 Copies

October 2003

Rate : Rs.35/-

Sole Distributors :

Navodaya Book House

Street Opp. Arya Samaj Mandir

Sultan Bazaar, Kachiguda

Hyderabad - 500 027, Ph: 040- 24652387

Printed at:

Sri Parasarya Press

Sir Vyasasramam. Yerpedu - 517 621

# విషయసూచిక

# ప్రజ్ఞా పుష్పం

## రచయిత మనవి

ఈ మూడవ సంపుటితో నేను సంకల్పించింది పూర్తి అయింది. 1982 నుంచి నేను కృష్ణమూర్తిని అధ్యయనం చేస్తున్నాను. అప్పట్లో వెలువడ్డ పుస్తకాలన్నీ చదివాను. వాటి నుంచి అనేక ముఖ్యాంశాలు సేకరించాను. టైపు చేయించాను. భద్రపరచుకొన్నాను. ఒకే విషయంపై కృష్ణజీ వివిధ పుస్తకాల్లో, సందర్భాల్లో చెప్పిన అంశాలను విషయపరంగా సంకలనం చేశాను. తర్జుమా చేశాను. దాదాపు ముప్పయికి పైగా విషయాలు సమకూరాయి. అందులో ఆ విషయాల గురించి నా చింతనను పరిచయ రూపంలో వ్రాసి 'జిడ్డు కృష్ణమూర్తి అవగాహన' పేరుతో మొదటి సంపుటి ప్రచురించాను (1990). మరో 11 విషయాలను చేర్చి రెండవ సంపుటి ప్రచురించాను (2001). అదే ధ్యానపుష్పం. ఇప్పుడు 8 విషయాలను కలిపి మూడవ సంపుటిగా వేస్తున్నాను. నేను 1984 లో చేసిన విషయ విభాగం రీతిలో ఆమెరికా ఫౌండేషన్ వారు, తర్వాత చేయడం మొదలు పెట్టారు. అది తెలిసిన తర్వాత నా ప్రయత్నం సవ్యమైందని నాకు ఆత్మవిశ్వాసం కల్గింది.

కృష్ణమూర్తి చెప్పిన క్రమంలో స్వానుభవం, హేతువు, తర్కం, శాస్త్రీయత, తాత్వికత, మానవత, సామాజికత, విశ్వజనీనత, అంతర్లీనత, అసాధారణత, అపూర్వత, సంపూర్ణత, ప్రేమ, ధ్యానం, తెలివి, స్వేచ్ఛ అనేవి ఆయనకు మొదటి నుంచీ చివరిదాక ప్రధానాంశాలు. కృష్ణమూర్తికి సత్యమనేది, చెప్పకనే, గొప్ప ప్రాథమిక ప్రధానాంశం. కృష్ణమూర్తిని చదివిన పిదప, ఆ విషయాల్లో మరే రచయితను చదవనవసరంలేదనిపిస్తుంది. అందుకే కృష్ణమూర్తి ప్రబోధాలపై నాకు అంతగా ఆసక్తి ఏర్పడింది!

ప్రతి విషయం గూర్చి నేను నాధోరణిలో కొంత చర్చించాను (జె.శ్రీ.) ఆ విషయంపై కృష్ణమూర్తి చెప్పిన అంశాలను జోడించాను (పుస్తకసూచికలు).

1988 నుంచి కృష్ణమూర్తి అధ్యయన కేంద్రాలు పెట్టి, చర్చా గోష్ఠులు నిర్వహిస్తున్నాం. తెలుగులో 6 పుస్తకాలు ప్రచురించాను. పత్రికల్లో ధారా వాహికగా

వ్రాశాను రేడియో ప్రసంగాలు చేశాను. సూక్తిముక్తావళిలో కృష్ణజీ బోధలు ప్రవేశపెట్టాను. ఇంకా టి.వి.లో వచ్చేటట్లు చేయాలి. శ్రీకాళహస్తిలోను, తిరుపతిలోను 3 రాష్ట్రస్థాయి సమావేశాలు జరిపాము. రాష్ట్రంలో ఆయా ప్రాంతాల్లో చర్చా నిర్వహణల్లో పాల్గొనడమే గాక, 2002 మార్చి (కొవ్వూరు) లో జె. కృష్ణమూర్తి రాష్ట్ర అధ్యయన కూటమి కమిటీని ఏర్పాటు చేయడమైంది.

1991లోనే కృష్ణమూర్తి గ్రంథాల తెలుగు సేతకై తెలుగు పదజాలం తయారు చేయడంలోను, అందుకై తెలుగు సమావేశాలేర్పాటు చేయడంలోను ముందుండి సహకరించి ప్రోత్సహించడంలో ముఖ్యపాత్ర వహించడమైంది.

ఈ పనులు నేను "జిడ్డుకృష్ణమూర్తి జీవనదర్శనం" అచ్చు వేయిస్తూ వసంత విహార్‌లో ఉన్న సమయంలో జరిగాయి. మహోన్నతుడైన, సమగ్ర విప్లవవైతాళికుడైన కృష్ణమూర్తిని తెలుగు వారికి మిక్కిలి సన్నిహితంగా పరిచయం చేయడానికి నా సాయశక్తులా కృషి చేయటానికి నేను సిద్ధపడ్డాను.

ప్రూపులు సరిచేయడం లోను పరిశీలన చేయడంలోనూ తోడ్పడిన శ్రీ స్వామి అచలానంద సరస్వతివారికి, ఎ.టి. బాబాజీ గార్కి హార్దిక ధన్యవాదాలు.

సంపూర్ణ మానవులు మనమధ్యనే ఉంటారు. కృష్ణజీ పుట్టింది మదనపల్లెలోనే. జ్ఞానం సంపూర్ణంకాదు, సర్వస్వమూకాదు. నిత్యావశ్యకమైంది అవగాహన. పోలిక అవగాహనకు అడ్డుకట్టు. అవగాహన గురువుపై ఆధారపడితే వచ్చేదికాదు. ఆధ్యాత్మిక అధికారం నియంతృత్వంలా ప్రమాదకరం. జీవితం పుణ్యమూకాదు, పాపమూకాదు, ఆదర్శబద్ధమూకాదు. పుణ్యాపాపాల విలువలు తెలియనివి. క్రియకు కర్మకు గల తేడా సూక్ష్మమైంది. అయితే అర్థవంతమైంది. శృంగారమనేది సహజాతం, సున్నితం. దానిపట్ల తీవ్రతతగదు, అలక్ష్యం కూడదు. నిబద్ధతను అంతం చేయడమే స్వేచ్ఛ, అదే విముక్తి. జీవన్మరణాలు కలిసే ఉంటాయనేది వినూత్నానుభూతి. కృష్ణమూర్తిని చదివినకొద్దీ ఇలాంటి జీవన సౌరభాలు అనుభమవుతాయి. The Flashes of Vacant Mind is Intelligence.

ప్రజ్ఞలో గల 'ప్ర' అను ఉపసర్గకు ఉత్కృష్టమైన, విశిష్టమైన అని అర్థం. ప్రజ్ఞ అనేది తెలివికి, అనుభూతికి చెందింది. విశేషమైన తెలివిని, అనుభూతితో కూడిన తెలివిని ప్రజ్ఞ అని చెప్పుకోవచ్చు. ఏ అంశంలోనైన ప్రజ్ఞ పని చేసినప్పుడు దాని యందు పూర్తి అవగాహన కుదురుతుంది. ప్రజ్ఞ అనే పదం బుద్ధుడు ప్రతి

సుగుణానికి అన్వయం చేసుకొని ప్రజ్ఞావంతుడైనాడు. కృష్ణజీ ప్రజ్ఞావంతుడు. ఆయన చెప్పిన అంశాలన్నీ ప్రజ్ఞతో కూడినవని బోధపరుచుకోవాలి. అందుచే ఇది ప్రజ్ఞాపుష్పం. ఈ పుస్తకాన్ని చక్కగా మనసు పెట్టి చదువగలరని ఆశిస్తున్నాను.

**తిరుపతి** ఇట్లు

23-7-03 **జె.శ్రీరఘుపతిరావు**

## నూత్న సమాజకాంక్ష

అసూయ, అత్యాశ, అశ్రిత పక్షపాతం, పగ, ప్రతీకారం, హింస, ప్రతిహింసల దావానలంతో ప్రజ్వరిల్లుతున్న ప్రస్తుత ప్రపంచానికి నూతన జీవన విధానాన్ని అందించారు జిడ్డుకృష్ణమూర్తి (కృష్ణాజీ). మనిషి జీవితంలోని ప్రతి పార్శ్వాన్ని స్పృశించి, సమస్యల్లేని ప్రశాంత జీవితాన్ని ఆవిష్కరించిన మహర్షి ఆయన.

కృష్ణాజీని అధ్యయనం చేసిన వారు ఆంధ్రరాష్ట్రంలో అతిస్వల్పం. అందులో రఘుపతిరావుగారు ఒకరు. ఆయనను ఆంధ్రులకు అతి త్వరగా పరిచయం చేయాలనే సదుద్దేశ్యంతో శ్రీ జె. రఘుపతిరావు గారు పూనుకొని పుంఖాను పుంఖాలు చిన్న పుస్తకాలుగా, పెద్ద గ్రంథాలుగా రచనలు చేసి ప్రచురిస్తున్నారు.

శీర్షికలుగా ఉపశీర్షికలుగా 3 సంపుటాల్లో కృష్ణాజీ ప్రవచించిన జీవితాంశాలన్నిటినీ రచయిత వెలువరించారు. ముఖ్యంగా యీ రచనల్లో చెప్పుకోదగిన విషయం - చర్చ నీయాంశాన్ని సామాన్యుని దృష్టినుంచి రచయిత చర్చించి, తరువాత ఆ అంశం పట్ల కృష్ణాజీ పరిశీలనను అందించారు. ఆ విధంగా ఆయా అంశాలపట్ల లోతైన, సూక్ష్మమైన కృష్ణాజీ దృక్పథం వైపు మనల్ని లాక్కొని వెళ్ళారు రచయిత.

ఈ గ్రంథాన్ని చదివి, అవగాహన చేసుకొని, పాఠకులు తమ జీవన గమనాన్ని నూతన అక్షం(Dimension)లోకి మార్చుకోగలరు. తద్వారా కృష్ణాజీ ఆశించిన నూతన సమాజ నిర్మాణానికి తోడ్పడగలరని ఆశించుదాం.

రచయిత మిక్కిలి అభినందనీయులు. వారి సంకల్పం ఫలిస్తుందని ఆకాంక్షించుదాం.

**-ఎ.టి. బాబాజీ**

# కృష్ణమూర్తి సంక్షిప్త జీవితం

జిడ్డు కృష్ణమూర్తి అధునాతన తాత్వికోన్నతులు. జీవన లోతులను, నిజమైన విలువలను తెలిసికొన్నవారు. జీవితాన్ని సమగ్రంగా అనుభవించినవారు. వసుధ మొత్తం వారి కుటుంబం. మానసిక వికాసం ఆయన ఒరవడి. నిత్యచైతన్యం ఆయన జీవితం. మానవత్వం ఆయన జీవితమకుటం. ప్రేమ ఆమకుటానికి మణి. ధ్యానం ఆమణి ప్రకాశం.

కృష్ణమూర్తి మదనపల్లెలో 1895 మే 11 అర్ధరాత్రి దాటాక పుట్టారు. తల్లి సంజీవమ్మ అతని 10వ ఏట చనిపోయింది. తండ్రి నారాయణయ్య తహసీల్దారు ఉద్యోగం చేసేవాడు. పదవీ విరమణానంతరం ఇద్దరు కుమారులతో మద్రాసు-అడయారు-థియొసాఫికల్ సొసైటీలో చేరాడు. సమాజము ముఖ్యులైన లెడ్‌బీటర్‌ను, ఆనిబెసెంట్‌ను బాలుడైన కృష్ణ ఆకర్షించాడు. కృష్ణను, తమ్ముడైన నిత్యానందను 'సమాజం'లో ప్రత్యేకంగా చదువు చెప్పించి పెంచారు. కారణాంతరాలచే వారిద్దర్నీ ఆనిబెసెంట్ ఇంగ్లాండు పంపింది. అచట ఇద్దరికీ ప్రత్యేక విద్యా శిక్షణ ఇప్పించింది.

1911లో ఆర్డర్ ఆఫ్‌దిస్టార్ అనే ఒక అంతర్జాతీయసంస్థను ఆనిబెసెంట్ స్థాపించి, కృష్ణను దానికి అధ్యక్షునిగా జేసింది. తద్వారా కృష్ణమూర్తి జగద్గురువుగా ప్రసిద్ధిజెందాలని ఆమె ఆశించింది. దానికి సభ్యులసంఖ్య గణనీయంగా పెరిగింది. ఆస్తులు విపరీతంగా చేరాయి.

కృష్ణచదువు, మెట్రిక్ ముమ్మారు తప్పడంతో, ఆగిపోయింది. ఫ్రెంచి భాష బాగా నేర్చుకున్నారు. నిత్యానంద లా చదువు పూర్తి చేశాడు. నిత్యానందకు క్షయవ్యాధి రావడంతో విశ్రాంతికై ఇద్దరూ కేలిఫోర్నియా సమీపంలో ఓహై(OJAI) లోయలో చేరారు. అత్యద్భుతమైన ప్రకృతి రామణీయకతను సంతరించుకొన్న స్థలమది. కృష్ణమూర్తిలో అక్కడ అనేకమైన మానసిక భౌతిక పరిణామాలు కలిగాయి. నడుము - మెడ - తలలో విపరీతమైన నొప్పులు, అపస్మారకస్థితులు సంభవించాయి. అంతర్గతంగా శుద్ధికార్యక్రమం నిరంతరం జరుగనారంభించింది. పరిశుద్ధుడు, నిష్కల్మషుడు, శూన్యుడు, తేజోమయుడు, సత్యదార్శనికుడు, కరుణామయుడుగా పరివర్తన జెందాడు. అది 1922లో పెప్పర్ వృక్షం క్రింద జరిగింది. అతడపుడు అపర బుద్ధునిలా సాక్షాత్కరించారు!

1925లో నిత్యానంద క్షయతో మరణించాడు. అమాయకులైన కృష్ణ, లోకం తెలిసిన నిత్యానందపై ఎక్కువ ఆధారపడేవారు, మక్కువ ఎక్కువ జూపే వారు. తమ్ముని మరణంచో కృష్ణఎదుర్కొన్న దుఃఖం అంతా ఇంతా కాదు. నిద్రాహారాలు లేకుండా పదిరోజులపాటు ఒంటరి వానివలె అలమటించారు, దుఃఖం అనుభవించారు. చివరికి తనకు తానే బయట పడ్డారు. తమ్ముని శక్తికూడ తనలో ప్రవేశించినట్లు ధైర్యం తెచ్చుకున్నారు. ఇతరులెవ్వరూ అలాంటి దుఃఖం పాలు కాకూడదని దృఢంగా భావించారు. పరుల దుఃఖ నివారణార్థం పాటు పడడం మొదులు పెట్టారు. మనిషిని సంపూర్ణ స్వేచ్ఛామయునిగా చేయడమే ఆయన పరమధ్యేయం.

మత సంప్రదాయాలు ఆధ్యాత్మిక సంస్థలు గురు పీఠాలు తత్వశాస్త్రాలు ఆరాధన సాధనలు ధ్యాన ప్రక్రియలు వీటన్నింటి వల్ల మానవునికి సత్యదర్శనంగానీ విమోచన గానీ కల్గడం అసాధ్యం అని తేల్చుకున్నారు. అంతే గాక ఆధ్యాత్మికం - ఆదర్శం - సిద్ధాంతం - సాధన - క్రమశిక్షణ - సన్యాసం - ధనం - అధికారం మొదలగు సాధన సంపత్తి వల్ల కూడ మనిషి స్వేచ్ఛ పొందలేడని అర్థమైంది. అంతర్గత త్యాగవైరాగ్య భావాలు మహోధృతమైనాయి. తనకు అధ్యక్షస్థానమిచ్చి ప్రతిష్ఠ దెచ్చిన ఆర్డర్ ఆఫ్ ది స్టార్ సంస్థను 1929లో రద్దు చేశారు. తనకు 'అమ్మ' అయిన ఆనిబెసెంట్ సమక్షంలోనే అది జరిగింది. వేలాది మంది సభ్యులనుండి తాను విడుదలైనారు. సంస్థకున్న కోట్లాది రూపాయల ఆస్థిని దాతలకు తిరిగి ఇచ్చి వేశారు. అందుకు దివ్యజ్ఞాన సమాజం దిగ్భ్రాంతిజెందింది. తానిక ఏ సంస్థలోనూ సభ్యుడుగా ఉండలేదు.

'Truth is a pathless land' అని చెప్పారు. సత్యాన్ని ఎవరికి వారే అన్వేషింకోవాలి. ఏ మతం, ఏగ్రంథం, ఏ గురువు దాన్నందించలేరు. ఏ క్షణానికాక్షణం దర్శించుకోవాలి. దాన్ని ఒక చోట స్థిరపరచి, దారివేయడం సరికాదు ఈవిధంగా స్పష్టంజేశారు. ఏవిషయానికైనా ప్రేమతో కరుణతో స్పందిస్తూ స్పృశించాలని ఉద్బోధించారు. నిత్యం వర్తమానంలో ఎరుకతో, స్వేచ్ఛతో, సచేతనంగా, గమనికగా ఉండడమే ధ్యానం అన్నారు, అదే ప్రేమ, అదే తెలివి. "నేను మార్పు జెందాను. నామిత్రుల జీవితాలకు మార్పు తెస్తాను. ప్రపంచ

పురోగతికి సాయపడతాను. నా అంతరంగమంతా శక్తితో నిండింది.... ఆనంద సామ్రాజ్యం చూపిస్తాను....." అంటూ జీవితం మొత్తం బోధకై వినియోగించారు.

ప్రతి సంవత్సరమూ దేశవిదేశాలు పర్యటించారు. ఓహై లోయలో 'ఆర్యవిహారం' అను కేంద్రం ఏర్పరచుకొని ఉన్నారు. ఋషివ్యాలి, మద్రాసు, బెనారెస్, బొంబాయి, బెంగుళూరు, బ్రాక్‌వుడ్ (ఇంగ్లాండు), ఓహై (కాలిఫోర్నియా) మున్నగుచోట్ల వినూత్న పాఠశాలలు స్థాపించారు. 'కృష్ణమూర్తి ఫౌండేషన్ల' ద్వారా వీడియో ఆడియోటేపులు, పుస్తకాలు యథాతథంగా లభిస్తాయి. ఆయా చోట్ల వార్షిక సమావేశాలు ఏర్పాటు చేస్తారు. ప్రపంచ ప్రసిద్ధులైన రాబిన్‌సన్, జాఫర్‌సన్, రోమ్‌లాండ, ఆంటాయిన్ బర్టెలే, ఆల్డస్ హక్స్లే, డా॥ బోమ్, నెహ్రూ, ఇందిరాగాంధి, డలైలామా మున్నగు వారికి ప్రీతి పాత్రుడు, సన్నిహితుడయినారు. 60 ఏళ్లపాటు తత్వవేత్తలు, వేదాంతులు, విద్యా వేత్తలు, సైంటిస్టులు, సైకాలజిస్టులు, మేధావులు, సాధారణులు, రచయితలు, కళాకారులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, మతబోధకులు, వృత్తి నిష్ణాతులు-ఎందరెందరితోనో చర్చలు జరిపి, వారిని ప్రభావితం జేశారు. వేలాది సమావేశాలలో ప్రవచించారు. జాతి మత కుల వర్గ జాతీయ వర్ణ విభేదాలు, మానసిక విభజనలు సమూలంగా సంపూర్ణంగా తుడిచివేశారు. ప్రపంచమానవుడుగా, మానవతామూర్తిగా తత్వవేత్తగా, చైతన్య స్ఫూర్తిగా, ప్రేమమూర్తిగా 90 సంవత్సరాల 9 నెలల 5రోజులు జీవించారు.

1986 ఫిబ్రవరి 17న దేహత్యాగం చేశారు. జనవరి 30న ఓహై కాటేజీలో కాన్సర్‌తో బాధపడుతూ ఫౌండేషన్ సభ్యులకు ఇలా జెప్పారు. "నన్ను దైవాంశ సంభూతుని చేయొద్దు. నాకు భక్తులులేరు..... స్మారకమందిరాలొద్దు....అందుకు విరుద్ధంగా జేస్తే నాబోధలు వృథా అవుతాయి". దేహాన్ని శుభ్రపరచి, దవళవస్త్రంతో చుట్టి, కాలిఫోర్నియా విద్యుద్దహన సాధనంతో భస్మాంతం జేశారు.

ప్రపంచబోధకుడు ప్రవచనాల ద్వారా ప్రపంచానికి ప్రశాంతప్రేమైక వెలుగై యున్నాడు.



# ABBREVIATIONS

| | |
|---|---|
| EII | Exploration into Insight |
| TMC | This Matter of Culture |
| TOR | The Only Revolution |
| COL/CLI | Commentories on Living Vol.I |
| TAI/AI | The Awakening of Intelligence |
| BV | Beyond Violence |
| LH/LA | Life Ahead |
| ESL | Education and Significance of Life |
| FLF | The first and Last Freedom |
| KNB | Krishnamurti Note Book |
| FH | The Future of Humanity |
| TR | Tradition and Revolution |
| TWOL/TWL | The Wholeness of Life |
| KAP | J.Krishnamurti A biography by Pupul |
| QA | Questions and Answers |
| O.Ed. | On Education |

***(These are the books Published before 1980)***

## MEANINGS

| | |
|---|---|
| అనుభవం | : Experience (past) |
| అనుభూతము | : Experienced (past) |
| అనుభూతి | : Experiencing (present) |
| తెలివి లేక ప్రజ్ఞ | : Intelligence |
| బుద్ధి (మేధస్సు) | : Intellect |
| అవగాహన | : Understanding |
| అసాధారణమైన | : Extraordinary |
| పరిశీలిన, పరికించుట | : Observation |
| సంవేదన | : Sensation |
| మతపరమైన మనసు | : Religious mind |
| అన్యత్వం | : Otherness, blessed ness |
| పరివర్తన | : Transformation |
| తత్క్షణమైన మార్పు | : Radical change |

# జ్ఞానం యొక్క స్థానం

జ్ఞ అంటే తెలిసికొనుట. తెలిసిన తర్వాత, తెలిసిందాన్నే మనం జ్ఞానం అంటున్నాం. తెలిసికోడానికి కుతూహలం సహకరిస్తుంది. తెలుసుకున్నాక అది జ్ఞాపకంగా మిగుల్తుంది. జ్ఞానం జ్ఞాపకాలుగా ఉంటుంది. ఒకప్పుడు మరుగున పడ్డా మరల బయటికి వస్తుంది. ఒకటి తెలిసిన తర్వాత మరొకటి తెలిసికోవాలని ఉంటుంది. జ్ఞానమొక విధంగా బ్రెయిన్ సెల్స్ ద్వారా సేకరింపబడుతుంది. అలా తెలిసిన వన్నీ మెదడులో నిలవ వుంటాయి. జ్ఞాపకాలను బట్టి జ్ఞానం మెదడు కణాల్లో, ఫిలుంలోలాగ దాగి ఉంటుంది. శాస్త్రాలు చదివినా, సైన్సు నేర్చుకున్నా అంతే.

తెలిసిందేదో తెలిసింది. తెలియందానికి ఏదో పేరు పెట్టనక్కర్లేదు. తెలిసిందంటే ఫలానిదని ఎఱుక కావడం. అజ్ఞానం తెలియంది అంటే ఏమిటోకూడా తెలియలేదన్న మాట. కనుక ఒకటి తెలిసిందంటే అది జ్ఞానావస్థే. అంతే కాని అజ్ఞానం కొంత కాలానికి జ్ఞానం కావడం కాదుకదా? అజ్ఞానం జ్ఞానంగా మారే ప్రసక్తే లేదు. ఏ సాధనా దానికి ఉపకరించదు. ఎవరూ అలా చేయలేరు. కాబట్టి జ్ఞానానికి అజ్ఞానానికి పరస్పర సంబంధం వుందని అనుకోవడానికి వీల్లేదు. నిజానికి విషయ సంగ్రహణమే జ్ఞానం.

తెలిసింది జ్ఞానమనుకొన్నాం. తెలిసింది అంటే అది జరిగింది లేక అది జరిగిపోయింది అనుకోవాలి. తెలిసిన విషయం తక్షణం గతంలోనికి జారుకుంటుంది. అంటే భూతకాలానికి సంబంధించిందై పోతుంది. కనుక జ్ఞానం అంటే గతానికి సంబంధించింది. కాబట్టి గ్రహించిన గతమే జ్ఞానం.

తెలియడం ద్వారా పొందిన విషయసమాచారం జ్ఞానమవుతుంది. సేకరింపబడింది జ్ఞానం. బుద్ధికుశలతతో త్వరగా గ్రహంచవచ్చు, అధికంగా గ్రహించవచ్చు. శాస్త్రాలు అధ్యనం చేసినా, సైన్సు వికాసాన్ని గ్రహించినా దాన్ని జ్ఞానమంటున్నాం. అలాంటి జ్ఞానం ఎంతైనా సంపాదించడం అవసరమంటున్నాం. ధర్మశాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు బాగా చదివి చెప్తున్నారు. వేద భాగాలు

కంఠస్థం చేస్తున్నారు. ఉపనిషత్తులు వల్లిస్తున్నారు. భగవద్గీత పారాయణ చేస్తున్నారు. వీటిని సాధన చేస్తున్నారు. అనుసంధానం చేస్తున్నారు. వాళ్ళు శాస్త్ర జ్ఞానం సంపాదించిన వారవుతున్నారు. అలాంటి జ్ఞానం గలవారిని జ్ఞానులు అంటున్నారు. కనుక విషయ సంగ్రహణమే జ్ఞానం. గత విషయమే జ్ఞానం.

అర్థం, అవగాహన, అవగతం, అవగమనం, ఆకళింపు, గ్రహింపు- అన్నీ ఒకే భావార్థాన్ని సూచిస్తాయి. భావం స్ఫురించడంతోనే క్రియ ప్రారంభమవుతుంది. అవగాహనలో భావం, క్రియ అనే రెండూ విడివిడిగా లేవు. అది ఏకోన్ముఖ ప్రక్రియ. దానిని భావచైతన్యం అనవచ్చు. అదే క్రియాశీలత - ఆచరణ- అనుభూతి- జీవితం యథార్థం.

అవగాహనలో ఆలోచన గౌణం. ఆచరణ ప్రధానం. ముందు సిద్ధాంతం తరువాత అనుష్ఠానమంటూ లేదు. అందులో సిద్ధాంతానికి తావులేదు. అసలు ఆలోచనకు, సిద్ధాంతానికి కట్టుబడితే అవగాహన కల్గదు.

జ్ఞానం రెండు రకాలు. ఒకటి భౌతిక జ్ఞానం, రెండు మానసిక జ్ఞానం. రెండూ అవసరమే. దేని స్థానం దానికి ఉంది. దేని పరిమితి దానికి ఉంది. జ్ఞానం ఆలోచనా రూపంలో పనిచేస్తున్నపుడు ఆలోచన యొక్క పరిమితిని, దాని అవసర అనవసరాలను గుర్తించడం ముఖ్యం. భౌతిక విషయాల్లో ఆలోచన పనిచేసినంతగా మానసిక విషయాల్లో అది పనిచేయనవసరంలేదు. దీని యొక్క అర్థం, పరిధి లోతుగా తెలుకోవలసియున్నది.

ఇంతవరకు జ్ఞానం స్థితిగతులను చెప్పడం జరిగింది.

--- రచయిత

# కృష్ణజీ మాటల్లో

## ఏ జ్ఞానం కావాలి?

జ్ఞానం అనే శబ్దానికి అర్థమేమిటి? ఆ శబ్దం వల్ల మనకు తెలిసిందేమిటి? జ్ఞానం నిల్వచేయబడుతుంది కదా, దాన్ని గూర్చి నిజంగా మనకు ఏం తెలుసు? వైజ్ఞానిక జ్ఞానం, సాంకేతిక జ్ఞానం ఒకస్థాయిలో అవసరమైనదే. దానికి మించి మనకేం తెలుసు. ఏ జ్ఞానం కావాలి?(TLA-92)

## జీవనాధార జ్ఞానం

జ్ఞానాన్ని ప్రోగు చేసుకోవటం గూర్చి ఎప్పుడైనా ఆలోచించారా? మీరెందుకు చదువుతున్నారు? ఎందుకు పరీక్షలు పాసవుతున్నారు? గణితం మొదలగు విషయాల్లో జ్ఞానం లేకపోతే ఎవరూ ఇంజనీరు గాని శాస్త్రజ్ఞుడు కాని కాలేరు. సామాజిక సంబంధం అలాంటి జ్ఞానం మీద ఆధారపడి ఉంది. అది లేకపోతే భౌతిక జీవనాధారం లేదు. సరే, జ్ఞానం తర్వాత మనకు తెలిసిందేమిటి? ఆ మీదట జ్ఞానం యొక్క స్వభావమేమిటి? (LA-92)

## జ్ఞానం స్వేచ్ఛ నివ్వదు

జ్ఞానం నిబద్ధితమైంది. పరిమితమైంది. జ్ఞానం స్వేచ్ఛ నివ్వదు. విమాన నిర్మాణ పద్ధతి తెలియవచ్చు. దాంతో కొన్ని గంటలలో ప్రపంచం అంచులకు ఎగిరిపోవచ్చు. కాని అది స్వేచ్ఛకాదు. జ్ఞానం సృజనాత్మకమైన అంశం కాదు. అది సాగుతూ వుంటుంది. ఎప్పుడూ కొనసాగుతూ వుండేది. అనగా జ్ఞానం, పరిపూర్ణం, అచింత్యం, అవ్యక్తం అయిన దానిదరికి చేర్చలేదు. అవ్యక్తమైన దానికి జ్ఞానం అవరోధం. అవ్యక్తమైంది వ్యక్తంలో యిమిడి వుండదు. తెలిసిందాంతో తెలియని దాన్ని కప్పలేము- తెలిసిన దాంతో తెలియనిది ఆవరించబడి వుండదు. తెలిసిందెప్పుడూ గతంలోకి చలించి పోతూవుంటుంది.(CLI-20?)

## కనుగొనటం

మనస్సు జ్ఞానంతో స్థంభించి వుండనపుడు, జ్ఞానం అనేది, మనసులో లేనపుడు అంటే జ్ఞానం గైరు హాజరైనవుడు మాత్రమే ఏదైనా కనుగొనడం జరుగుతుంది. అప్పుడు మాత్రమే నిశ్చలత, స్పేసు (ఖాళీ) వుంటాయి. ఆ స్థితిలోనే జ్ఞానం నిస్సంశయంగా ప్రయోజనకారియే, కాని మరో స్థాయిలో నిశ్చయంగా హానికరమైంది. మానసిక తృప్తికి వ్యక్తి స్తోత్రానికి జ్ఞానాన్ని వాడడం దుష్టమవుతుంది. విభాగాన్ని, నిరోధాన్ని తెచ్చి పెడుతుంది.

## ఆత్మవ్యాపకత్వం

ఆత్మ వ్యాపకత్వం విచ్ఛినకరమైంది - అది దేవుడు పేర జరిగినా సరే, రాష్ట్రం పేర జరిగినా సరే, నిబద్ధమైనా సరే. జ్ఞానం ఒక స్థాయిలో కావాలి. భాష నేర్చుకోటానికి, సాంకేతికావసరాలకు అది అవసరం. (CLI-206)

## నిబద్ధత

మనం జీవించడానికి ఈ నిబద్ధత ఆవశ్యకమైందే, భద్రతనిస్తుంది. కాని ఈ నిబద్ధతను మానసిక సౌభాగ్యానికి, సంతృప్తికి వినియోగిస్తే అపుడది తప్పని సరిగా ఘర్షణను గందరగోళాన్ని కల్గిస్తుంది.(CLI-206)

ఒక ప్రత్యేకమైన సమాజం వల్ల నీవు నిబద్ధింప బడ్డావు. ఒక స్థాయిలో ఆ సమాజానివి నీవే- అంటే దేవుణ్ణి నమ్మడం, సాంఘిక విభజనను విశ్వసించడం. మరొకరు దేవుడు లేడనుకోవడం, వేరే సిద్ధాంతాన్ననుసరించడం కూడ నిబద్ధతే. ఇరువురికి కూడ వాళ్ళ నమ్మకాల్ని బట్టి వాళ్ళ అనుభవమేర్పడుతుంది. కాని ఆ అనుభవం. అవ్యక్తమైన దానికి అవరోధం. అనుభవం, జ్ఞానం (అదే జ్ఞాపకం) కొన్ని స్థాయిల్లో అవసరం. కాని మానసికమైన "నేను" అనే అహాన్ని బలీయం చేయడానికి సాధనగా అనుభవాన్ని వాడేటట్లయితే భ్రమని, దుఃఖాన్ని తెచ్చి పెడుతుంది. మనస్సు అనుభవాల్తోను, జ్ఞాపకాల్తోను, జ్ఞానంతోను కూరుకుపోయినపుడు మనమేం తెలిసికోగలం? మనకు తెలిసి, అనుభవించడమంటూ వుంటుందా?

తెలిసింది అనుభవించడాన్ని అడ్డగించదా? నీకు పువ్వు పేరు తెలియవచ్చు. అంత మాత్రాన పువ్వును అనుభవించడం జరుగుతుందా? అనుభవించడం ముందు జరుగుతుంది, ఆ తరువాత పేరు పెట్టడమనేది అనుభవానికి బలాన్నిస్తుంది. పేరు పెట్టడ్డం ఇంకా ఇంకా అనుభవించడాన్ని అడ్డగిస్తుంది. అనుభవించే స్థితి వుండాలంటే పేరు పెట్టడం, జత పడడం జ్ఞాపకాలు పెట్టుకోవడం మొదలగు వాటి నుండి స్వేచ్ఛగా వుండొద్దా? (CLI-208)

## జ్ఞానమే అనుభవం

దేవుణ్ణి తెలిసికోవడానికి జ్ఞానం కావాలి అంటే అర్థమేమిటి? తన్ను తాను తెలిసికోవడానికి జ్ఞానం కావాలి. అంటే అర్థమేమిటి? జీవిత చీకాకుల నుండి బయటపడే మార్గం తెలిసికోవాలంటే జ్ఞానం కావాలి- అంటే అర్థమేమిటి? ఇక్కడ జ్ఞానమంటే అనుభవం అని అర్థం. ఆ అనుభవమేమిటి? అనుభవం ద్వారా మనకు తెలిసిందేమిటి? ఈ జ్ఞానాన్ని వాడేది అహం కాదా? తద్వారా తన్నుతాను బలపరుచుకోవడం లేదా? (LA-92)

## అనుభవమే అహం!

ఉదాహరణకు సంఘంలో నాకు ఒక స్థానం లభించిందనుకోండి. విజయంతో, హోదాతో, అధికారంతో, హామీతో కూడిన ఈ అనుభవం నాకు సౌఖ్యాన్నిస్తుంది. ఆ లక్షణాలతో కూడిన జ్ఞానం 'నేను' లేక 'అహం' అనే దాన్ని బలపరుస్తుంది. అంతే కదా.(TLA-93)

## అహమే "నేను"

జ్ఞానంతో పుబ్బిపోయిన పండితులెట్లున్నారో చూస్తున్నారు కదా! "నాకు "నీకంటే ఎక్కువ అనుభవముంది నాకు తెలుసు నీకు తెలియదు" అనే ధోరణిలో వుండే జ్ఞానవంతులైన తల్లిదండ్రుల్నీ, ఉపాధ్యాయుల్నీ చూస్తున్నారు కదా. కేవలం సమీకృతమైనట్టి జ్ఞానం క్రమంగా గర్వాన్ని, అహంకారాన్ని "నేను" అనుదాన్ని పోషిస్తుంది. ఏమీ లేకుండ, దేని మీద ఆధార పడకుండ "అహం" వుండలేదు.(LA-93)

## జ్ఞానం వెనక భయం

తాను ఫలానా అని అనుకోవడానికి దంబాన్ని పోషించడానికి విద్వాంసుడు జ్ఞానాన్ని వాడుకుంటాడు. అట్లే శాస్త్రజ్ఞుడు కూడ. అధ్యాపకులు, తల్లిదండ్రులు, గురువులు ఈ లోకంలో ఏదేదో కావడానికి, వాళ్ల ధ్యేయానికి మార్గంగా వాళ్ళ కోర్కె నెరవేరడానికి సాధనంగా జ్ఞానాన్ని వాడుకుంటారు. జనం వాళ్ళవెంట పడుతుంటారు. అసలు వాళ్ళకు నిజంగా తెలిసిందేమిటి? పుస్తకాల్లో వుండేదేమిటో వాళ్ళకు తెలుసు, అనుభవించినదేమిటో వాళ్ళకు తెలుసు. ఆ అనుభవం వాళ్ళ నిబద్ధతను బట్టి వుంటుంది. వాళ్ళలాగే మనలో చాలమందిమి శబ్దాల్లో నిండిపోయి ఉన్నాం. సమాచారంతో నిండి వున్నాం. దాన్నే జ్ఞానమంటున్నాం. అది లేకపోతే మనం లేము. కనుక ఈ మాటల సమాచారం వెనుక ఎప్పుడూ భయం దాగి వుంటుంది. (TLA-93)

## భయమున్నచోట ప్రేమ లేదు

భయమున్న చోట ప్రేమ లేదు. ప్రేమ లేకపోతే జ్ఞానం మనల్ని నాశనం చేస్తుంది. ప్రస్తుతం లోకంలో అదే జరుగుతున్నది. ప్రపంచ మానవులందరిని పోషించడానికి మనకు కావలసినంత ఆహారం వుంది. మానవులందరికి గుడ్డ, గూడు కల్పించడం మనకు చేతనవును. కాని మనమది చేయడం లేదు. ఎందుకంటే మనం సొంత అహంకారయుత కార్యకలాపాలతో జాతీయంగా గుంపులు గుంపులుగా విడిపోయాం. యుద్ధం ఆపాలని మనకు నిజంగా వుంటే ఆపగలం. మనకదిలేదు. అందుకని ప్రేమలేని జ్ఞానం వినాశనానికి మార్గమవుతుంది. మనకిది అవగాహన కానంతవరకు ఎన్ని పరీక్షలు పాసయినా ఎన్ని సాధించినా, ఎన్ని ప్రతిష్టలు, హోదాలు సంపాదించినా అవన్నీ అవినీతికి, అణగిపోవడానికి, మానవ హుందాతనాన్ని తగ్గించడానికి దారితీస్తాయి. (TLA-93)

## జ్ఞానం ఆత్మతృప్తికా ?

ఒక స్థాయిలో జ్ఞానం కావలసివున్నా దాన్ని అహంకారయుతంగా స్వార్థానికి ఎలా వాడుతున్నామో చూడండి. పరిశీలించండి. మిమ్మల్ని మీరు గమనించండి.

అనుభవాన్ని ఆత్మ పొంగిపోవడానికి, అధికారానికి, గర్వోపకరణానికి మనసు వినియోగిస్తూ, వుంది. ఇది తెలుస్తూనే వుంది. పెద్దవాళ్ళను చూడండి, పదవులకు విజయానికి ఎలా ఎగబడుతుంటారో, వాళ్ళచుట్టూ వాళ్ళు భద్రత అనే గూడును నిర్మించుకుంటారు. వాళ్ళలాగానే మనం కూడ అనేక విధాలుగా అధికారం, హోదా, గౌరవం మొదలగు వాటి వెంట పడుతుంటాం. మనకు మనంగా వుండాలని లేదు. పలానా స్థితిలో వుండాలనో, ఏదో కావాలనో కాంక్ష వుంది. అది జ్ఞానం ద్వారా బలపడుతుంది, కొనసాగుతుంది. దాన్నే ఆత్మతృప్తికి వాడుతుంటాం. (TLA-94)

## ప్రత్యక్షానుభవానికి ప్రేమకావాలి, జ్ఞానం కాదు

యుక్త వయసు వచ్చిన కొలదీ మనమీ సమస్యల్ని అర్థం చేసుకోవాలి. ఎందుకంటే కేవలం పదవుల్ని, బిరుదుల్ని, గొప్ప జ్ఞానాన్ని చూసి మనం ఏ మనిషిని గౌరవించరాదు. వాస్తవానికి మనకు తెలిసింది చాలా తక్కువ. ఎన్ని పుస్తకాలైన చదవవచ్చు. కాని చాలామందికి ముఖాముఖిగా (నేరుగా) ఏలాంటి అనుభవమూ లేదు. ప్రత్యక్ష సత్యదర్శనం - దైవానుభూతి- చాలా ముఖ్యం. దానికై ఎంతో ప్రేమ అవసరం.(LA-94)

## సాధించడంలో ప్రేమ వుండదు

విజయాలతో, కోర్కెలతో, జ్ఞానంతో కూడుకున్న వారికి నిజమైన ప్రేమ వుండదు. వాళ్ళు తాము సాధించడానికి, సాంధించనున్న దానికి చాలా ప్రాధాన్యత యిస్తారు. చివరికది మనిషిని నాశనం చేస్తుంది.(TLA-95)

## స్మరణే సంప్రదాయం

జ్ఞానమనేది సాంప్రదాయిక రూపమే కదా? స్మరణ యొక్క పనే సంప్రదాయం. యాంత్రిక విషయాల్లో, సంప్రదాయం ఆవశ్యకం. కాని దాన్ని అంతరంగిక మార్గదర్శిగా వాడితే ఉన్నత విషయాలు కనిపెట్టడానికి అది అవరోధమవుతుంది.(TMC-143)

## పునరుక్తి జడత్వాన్నిస్తుంది

జ్ఞానమంటే మనకేం అర్థమయింది? పదే పదే జీవిత అనుభవాల్ని వల్లించడమే హెచ్చుగా వుంది. నేర్చుకున్న దానికి అదనంగా మరికొంత చేర్చవచ్చు. కాని పునరుక్తం చేయడం జరుగుతూ వుంటుంది. నేర్చుకోవడమనే అలవాటును పునరుక్తి బలపరుస్తూ వుంటుంది. చదివింది, చెప్పింది, అనుభవం పొందింది ఇంతమాత్రం తప్ప మనకు ఇంకేం తెలుసు? ఇపుడు పొందే అనుభూతి కూడ గతానుభవం నుండి పొందిందే, గతానుభవం ద్వారా పెద్దది చేయబడిందో లేక మార్పు చెందిందో తద్వారా పునరుక్తం చేసే క్రియ కొనసాగుతుంది. అనుభవం మంచిది గాని చెడ్డది గాని, ఘనమైంది గాని హీనమైందిగాని పునరుక్తం అవుతూ వుంటే అది జడత్వాన్నే కలుగజేస్తుంది. ఎందుకంటే మనసెప్పుడూ తెలిసిన పరిధిలోనే తిరుగుతూ వుంటుంది. మనసు స్థబ్దత చెందడానికి ఇది కారణం కాదా? (CLIII-36)

## జ్ఞానం సమస్యను తీర్చలేదు

జ్ఞానమే జీవిత మొత్తం కాదు, ఒక భాగం మాత్రం. కాని ఇపుడు ఒక భాగమే సర్వస్వమన్నట్లు భ్రమింపచేస్తుంది. అదే మొత్తం ప్రాధాన్యతను సంతరించుకొంటున్నది. అలాంటప్పుడు జీవితం అలలాగ పైపైన పోతూ ఉంటుంది, మొండితనవు దినచర్య అవుతుంది. మూఢ నమ్మకాలతో ప్రక్కదారి పడుతుంది. యాంత్రిక దిన చర్యనుండి తప్పుకోవాలని వుంటుంది. దాంతో భీభత్సంతో కూడిన పర్యవసానమేర్పడుతుంది. ఎంత విస్తృతమైనా, ఎంత యుక్తిగా ప్రవేశపెట్టినా కేవలం జ్ఞానం మానవ సమస్యలను తీర్చలేదు. అది తీర్చుతుందనుకోవడం నిరుత్సాహాన్ని, దుఃఖాన్ని ఆహ్వానించడమే అవుతుంది. ఏదో ఇంకా లోతైంది కావాలి. ద్వేషించడం నిష్ప్రయోజనమని ఒకరికి తెలియవచ్చు, కాని ద్వేషం నుండి విముక్తి చెందడం అనేది పూర్తిగా వేరే విషయం. ప్రేమ జ్ఞానానికి సంబంధించిన ప్రశ్నకాదు.(CL III-3)

## జ్ఞానం కూడ సంపాదనే

సంపాదనకు మరో రూపం జ్ఞానం. జ్ఞానం కలవాడు దాంతో

తృప్తిపడుతున్నాడు. అతనికి దాని ప్రయోజనమంతే. ఇక అదే పరిసమాప్తి. అతనికి ఒక విధమైన భావం వుంది. కొద్దో గొప్పో దాన్ని లోకంలో ప్రచారం చేస్తే మన సమస్యలు తీరుతాయి. సంపన్నుడు సంపదనుండి విముక్తి పొందడం కన్న జ్ఞాన సంచయం కలవాడు దాన్నుండి బయటపడడం కష్టతరమైంది. అవగాహన యొక్క, విజ్ఞానం యొక్క స్థానాన్ని జ్ఞానం తేలిగ్గా ఆక్రమిస్తుంది. ఇది వింతగా వుంటుంది. వస్తువుల గూర్చిన సమాచారం మనదగ్గరుంటే అదే అవగాహన అనుకుంటున్నాం. సమస్యను గూర్చి తెలిసికోవడంతో, సమాచారం పొందడంతో సమస్య పోతుందనుకుంటున్నాం. సమస్యలు, కారణాలు వెతుకుతుంటాం. ఆ వెతకడమే అవగాహనాన్ని వాయిదా వేస్తుంది. మనలో ఎక్కువ మందికి కారణం తెలుసు. ద్వేషానికి కారణం పెద్ద లోతుగా దాగి వుండదు. కాని దాని కారణాన్ని వెతుకుతూ దాని ప్రయోజనాన్ని సమన్వయం చేసికోవడంతో సరిపెట్టుకుంటాం. మొత్తం ప్రక్రియను అవగాహన చేసికోవడానికి తలపెట్టం. మనం ఎక్కువగా సమస్యలతో ముడిపెట్టుకొని వుంటాం. అవిలేకపోతే మనకు వునికి లేదనుకుంటాం. సమస్యలే మనకు పని కల్పించేవి. సమస్యల కార్యకలాపమే మన జీవితాన్ని నింపుతుంది. మనమే సమస్య, మనమే దాని కార్యకలాపం. (CLI-230)

## జ్ఞానం వినాశనాన్ని ఆపలేదు

జ్ఞానం ద్వారా అవగాహన కలుగుతుందా? జ్ఞానం క్రియాశీలక అవగాహనాన్ని అడ్డగిస్తుందా? ఎన్నో విషయాలు సమకూర్చడం, సమాచారం సేకరించడం, పుస్తక భాండాగారమంత జ్ఞానం కలిగి వుండడం మొదలగు వాటివల్ల మనం బంధ విముక్తులౌతామనుకుంటాం. అట్లా కాదు. వైరం, ద్వేషం, యుద్ధం వినాశనాత్మకాలు, నిరుపయోగాలని తెలిసినా అవి ఆగడం లేదు. కాబట్టి మనమెందుకు సమాచార జ్ఞానం సంపాదిస్తున్నామో కనుక్కోవడం ముఖ్యం కాదా?(CLII-207)

## జ్ఞానం దుఃఖ నివారణ కాదు

ఎన్నో క్షేత్రాల్లో మనమెంత జ్ఞానం సంపాదించినా ఒకే వర్గంలో, ఒకే జాతిలో,

ఒకే మతంలో మానవుడు మానవుని పట్ల చూపుతున్న క్రౌర్యాన్ని జ్ఞానం ఆపలేక పోతుంది. బహుశా జ్ఞానం మనల్ని మరొకదాన్ని చూడకుండా చేస్తున్నదేమో, వ్యాకులతకు దుఃఖానికి నిజమైన పరిష్కారం ఆ మరొకటే కావచ్చు. (CLII-207)

## అజ్ఞానం - తెలియనితనం

అజ్ఞానం వేరు, తెలియని స్థితిలో వుండడం వేరు. ఒక దానికొకటి సంబంధం లేదు. నీవు బాగా నేర్చుకున్న వాడివి, తెలివిగల వాడివి, సమర్థుడవు, లక్షణ లక్షితుడవుకావచ్చు అయినా అజ్ఞానివి కావచ్చు. తనను గూర్చిన జ్ఞానం లేనపుడు అజ్ఞానముంటుంది. తనను గూర్చి జాగృతి నొందని వాడు అజ్ఞాని. తనవంచనలు, తన డంబాలు, తన ఈర్ష్యలు మొదలగునవి తెలియని వాడు అజ్ఞాన మానవుడు. తనను గూర్చిన జ్ఞానమే స్వేచ్ఛ. భూమి మీద వేరే లోకాల్లో కూడా వింతైన విషయాలు తెలిసి వుండవచ్చు. అయితే ఈర్ష్య నుండి, దుఃఖాన్నుండి బయటపడక పోవచ్చు. కాని "నాకు తెలియదు" అన్నావంటే నీవు నేర్చుకుంటున్నావన్న మాట. నేర్చుకోవడమంటే జ్ఞానాన్ని గాని, వస్తువులనుగాని, సంబంధాలను గాని నేర్పడం కాదు. తెలివిగా వుండడమే అంటే సరళంగా వుండడం. సరళంగా ఉండడమనేది ఎంతో కష్టమైంది.(CLII-176)

## జ్ఞానం పూజనీయమా ?

మావవులు జ్ఞానాన్ని నిల్వ చేసికొని పూజిస్తుంటారు. శాస్త్రజ్ఞానాన్నే కాదు. ఆధ్యాత్మిక జ్ఞానమనబడే దాన్ని కూడ. ఏం జరిగింది, ఏం జరగబోతుంది అనే జ్ఞానం ఎంతో ప్రధానమైందని భావిస్తారు. సమాచారాన్ని నిల్వచేయడంగాని, జ్ఞానాన్ని ఆరాధించడంగాని దేనివల్ల చేస్తాం? భయం వల్లనే కదా. జ్ఞానం లేకపోతే మనమేమై పోతామోనని, ఎలా ప్రవర్తించాలో తెలియదని భయపడతాం. ఋషులు చెప్పింది చదవడం ద్వారా ఇతరుల నమ్మకాల ద్వారా అనుభవాల ద్వారా మనం క్రమంగా జ్ఞానమనే తెరను కట్టుకుంటాం. అదే సంప్రదాయం అవుతుంది. ఈ సంప్రదాయాన్ని శరణు పొందుతాం. ఈ సంప్రదాయం లేకపోతే బ్రతకలేమనుకుంటాం.(LA-92)

## జ్ఞానం - అహం

జ్ఞానాన్ని అనుభవాన్ని నిల్వజేసినపుడు ఏమవుతుంది? అదనంగా ఏ అనుభవం వచ్చినా వెంటనే జ్ఞానం అధికం కావడమవుతుంది. నిజంగా అది అనుభవించడం కాదు, సమకూర్చుకోవడమే. ఇది మనసు చేసే పని. అధికం అనే దాని కేంద్రమే మనసు. ఆ అధికమే "నేను" అహం. అదే స్వార్థాన్ని కప్పియున్న ఉపాధి. ప్రతికూలంగానో అనుకూలంగానో కూడబెట్టుకోవడమే దాని పని. కూడ బెట్టుకున్న అనుభవంతో మనసు జీవితాన్ని చూస్తుంది. ఈ విధంగా జీవితంతో మనసు ఇంకా ఇంకా కూడబెట్టుకోవాలనే చూస్తుంది. మనసు కూడబెట్టుకునే పని ముట్టై వున్నంతకాలం నిజంగా అనుభవిస్తుండడమంటూ వుండదు. అనుభవం నుంచి ఏదో పొందాలనుకోవడం, అంటే మరొకటి మరొకటి పొందాలనుకోవడం, నిజమైన అనుభూతికి సిద్దపడడమెలా అవుతుంది?(LA-140)

## విభజించేవి, చీల్చేవి

సైన్సుగాని, సాంకేతిక జ్ఞానం కాని మనషుల్ని చీల్చేది కాదు. చీల్చేవి సంప్రదాయం, నమ్మకాలు. అవే మనసును నిబద్ధించేవి, అనగా చీల్చేవి. (TMC-143)

## సాంకేతిక జ్ఞానం

సాంకేతిక జ్ఞానాన్ని కొట్టిపారవేయలేము. కాని ఆంతరంగికంగా ఎంత అసహ్యంగా వున్నామె, ఎంత కాఠిన్యంగా వున్నామో, ఎంత వంచనతో, అవిశ్వాసంతో వున్నామో, ఎంత ప్రేమరహితంగా వున్నామో తెలిసి వుండాలి. జాతీయతనుండి, అసూయ నుండి అధికార దాహం నుండి తెలివిగా బయటపడిననాడు క్రొత్త సమాజం నిర్మాణమవుతుంది.(ESL)

## జ్ఞానం ఒక అడ్డంకి

వూహలమీద, అనుభవాల మీద ఆధారపడి మనసు నిర్ణయాలకు కట్టుపడితే వినడం సాధ్యమా? విన్న దాన్ని తెలిసిన దానిలోకి మనసు మార్చకుండ వుంటే ఎవరైన వినగలరు. జ్ఞానం శ్రవణాన్ని అడ్డగిస్తుంది. ఒకరికి ఎంతైనా తెలిసి

వుండవచ్చు. తెలిసిందానికన్నా పూర్తిగా వేరైంది వినాలంటే, తన జ్ఞానాన్ని ప్రక్కన పెట్టాలి. అవునా? (CLI-97)

## జ్ఞానం అంతం కావాలి.

జ్ఞానాన్ని అంతం చేయడమే విజ్ఞానానికి, విచక్షణకు ఆరంభం. విచక్షణ కాలానికి సంబంధించింది కాదు. అనుభవం యొక్కగాని, జ్ఞానం యొక్కగాని కొనసాగింపుకాదు. కాలంలో వున్న జీవితం గడబిడతో కూడింది. బాధతో కూడింది. కాలతీతమైంది వున్నపుడే ప్రసన్నత లభిస్తుంది.(CLI-233)

## ప్రేమించే మనసు

కావలసినంత జ్ఞానం, అనుభవం, జీవిత సంపద, ఉనికిలో అందం, పోరాటాలు, బాధలు, నవ్వులు వుంచుకొని కూడ మనసును సరళంగా పెట్టుకోవడం గొప్పకళ. ప్రేమించడం తెలిసినపుడు మాత్రమే సరళమైన మనసుండగలదు.(TMC-28)

## ఆలోచన జ్ఞానం

కండ్లు, చెవులు మూసుకో. అయినా ఆలోచన వుంటుంది. దేవుడున్నాడని అన్న వెంటనే ఆలోచించడం మొదలు పెడతావు. అది ఆలోచనా క్షేత్రంలోనే అనగా స్మృతి పరిధిలోనే వుంటుంది. అసలు అంతకు ముందు ఏ మాత్రం ఆలోచించని వానికి దేవుడే లేడు. మహోన్నతమైన దాన్ని గూర్చి, గొప్పదాన్ని గూర్చి ఆలోచించేటప్పుడు పూర్వీకులు దేవుడున్నాడు అని అన్నారు. అది ఆలోచనా ఫలితమే. కనుక అది జ్ఞానం అనే క్షేత్రంలోనే వుంది. (TR-D20)

## సంపాదన - స్వేచ్ఛ

స్వేచ్ఛ నిమిత్తం జ్ఞాన సంపాదనలో పడ్డ మనసు స్వేచ్ఛనందుకోలేదు. జీవితంలో జ్ఞానమెందుకు అంత ప్రధానమైంది? సైన్సు, సైకాలజీ ద్వారా ఇతరులు గడించిన అనుభవసేకరణ ద్వారా వ్యక్తి పరిశీలన ద్వారా, నేర్చుకోవడం ద్వారాను పొందిన జ్ఞానము స్వేచ్ఛ పొందడానికేమయినా పనికి వస్తుందా? జ్ఞానమెప్పుడూ

గతానిదే, "నాకు తెలుసు" అని ఎప్పుడన్నావో, నీకు తెలిసిపోయిందన్న మాట. ప్రతిదీ, సైన్సుకు సంబంధించిందిగాని, వ్యక్తిగతమైందికాని, కుల వర్గ పరమైంది కాని, ఏదైనాగాని ఎప్పుడూ గతంలోనిదే. మనిషి మనసు గతం యొక్క ఫలమైనప్పుడు అది స్వేచ్ఛగా వుండగలదా? (BV-145)

## జ్ఞానంతో కూరుకుపోవడం

ఇతరులు చెప్పిన అనేకానేక సంగతులతో మన మనస్సులు నిండిపోయి వున్నాయి. కనుకే ప్రత్యక్షానుభవం పొందడానికి అసమర్థులం ఈ సమస్యను మనం తీసుకోవాలి. మనసును సరళంగా వుంచుకోవాలి. (FLF)

## అభిప్రాయాలు - భద్రత

స్వీయ జ్ఞానంలోనే ఆ సరళత వుంటుంది. మన ఆలోచనా గమనం గ్రహించాలి. ప్రజానాడి ద్వారా, ఇతరులనేదాని ద్వారా మనం స్పందించడం ద్వారా మనల్ని మనం తెలుసుకోవాలి. బుద్ధుడు, క్రీస్తు, గొప్ప ఋషులు చెప్పిందాని మీద మనకున్న అభిప్రాయాలేమిటో తెలియాలి. అభిప్రాయాలు, భద్రత, రక్షణ చేకూరుస్తున్నాయని అనుకుంటే మాత్రం భయంతో బ్రతకడమే అవుతుంది. వాళ్లు చెప్పింది తెలిసియుండవచ్చు. నచ్చుబాటు కావచ్చు. కాని మీసమస్య నది తీర్చదు. (FLF)

## అభిప్రాయం సత్యంకాదు

అభిప్రాయం సత్యంకాదు. అభిప్రాయాలు కల్పించడం వాస్తవమని పించుకోదు ఎన్ని రకాలుగా చర్చించినా ఎంత దీర్ఘంగా చర్చించినా, వాటి మంచీ చెడ్డల గూర్చి క్షుణ్ణంగా పేర్కొన్నా, ఎంతో హేతుబద్ధంగా వున్నా అభిప్రాయం సత్యం కాదు. అభిప్రాయమెప్పుడూ పాక్షికమే. దానికి సంస్కృతి, చదువు, జ్ఞానం, రంగు పులుముతుంది. మనస్సు అభిప్రాయాలతో ఎందుకు బరువెక్కాలి? ఒక మనిషిని గూర్చో, పుస్తకాన్ని గూర్చో సంకల్పం గూర్చో అదని ఇదని చేసే ఆలోచన అంతా బరువే. మనసు ఖాళీగా ఎందుకు వుండకూడదు? ఖాళీగా వున్నపుడే స్పష్టంగా చూడగలదు.(OR-131)

## అభిప్రాయం కఠినచర్య అవుతుంది

అభిప్రాయాలను పోషించవచ్చు, నిశితపరచవచ్చు, కఠిన పరచవచ్చు. మన పనులన్నీ ఇష్టాయిష్టాల సూత్రాన్ననుసరించి జరుగుతుంటాయి. అనుభవాన్ని లేక జ్ఞానాన్ని కాఠిన్యం చేస్తే అది క్రియల ద్వారా బయటపడుతుంది. అలాంటి క్రియలు మనుషుల్ని విభజన చేస్తాయి. మనిషి నుండి మనిషిని దూరం చేస్తాయి.(OR-131)

## అభిప్రాయం అవరోధం

నిజంగా వున్న దాన్ని అభిప్రాయం, నమ్మకం చూడనీయవు. వున్న దాన్ని చూడడమే తెలివిలో భాగం. శారీరక సునిశితత్వం, భావ సునిశితత్వం, మనసు స్పందించడం లేకపోతే తెలివిలేదు. పరిశీలనలో స్పష్టత వుండదు. ఉద్రేక భావం, ధృడాభిప్రాయం, భావసునిశితత్వాన్ని అడ్డగిస్తాయి. ఒక దాంట్లో స్పందించడం, మరొక దాంట్లో జడంగా వుండడం వైరుధ్యానికి, ఘర్షణకు దారి తీస్తుంది. అందులో వివేకముండదు. ముక్కల్ని చెక్కల్ని అన్నీ తెచ్చి కలపడం తెలివి అనిపించుకోదు. స్పందించడమే అవధానం. అదే తెలివి. జ్ఞానంతోను, సమాచారంతోను తెలివికి పనిలేదు. జ్ఞానమెప్పుడూ గతానిదే. అది వర్తమానంలో పనిచేయవచ్చు. అయితే వర్తమానాన్ని పరిమితం చేస్తుంది. తెలివి ప్రస్తుతానికి (వర్తమానానికి) సంబంధించింది. కాలానికి సంబంధించింది కాదు. (OR-131)

## అనుభవం స్మృతి

ఉన్నదున్నట్లుగా చూడడం ప్రధానంగాని, ఏమి తెలిసిందనేది ప్రధానం కాదు. ఎందుకంటే అవగాహన అనేది తక్షణం జరిగేది. భవిష్యత్తుకు సంబంధించింది కాదు. అవగాహన స్థానాన్ని జ్ఞానం, అనుభవం పొందినాయంటే అవి వినాశనకారులౌతాయి. జ్ఞానం- అనుభవం ముఖ్యమై పోయాయి. లోతుగా పరిశీలిస్తే మానవుడు దిగజారిపోవడానికి అవే కారణాలని తెలుస్తుంది. అనేక విధాలైన నిర్మాణాలకు శాస్త్రజ్ఞానమెంతో కావాలి. కాని అవగాహనలేని జ్ఞానం, - కేవల స్మృతి వినాశదాయక మౌతుంది. అనుభవం కూడ అలాగే వినాశకరమైందని కూడ గ్రహిస్తావు. ఎందుకంటే అనుభవం కూడ స్మృతికి బలాన్ని చేకూరుస్తుంది. (LA-114)

## జ్ఞాపకం ఒక బరువు

జీవితం ప్రవాహం లాంటిది. మారిపోతుంది. హరించిపోతుంది. ఎప్పుడూ ఆగదు. అలాంటి జీవితాన్ని జ్ఞాపకాల భారంతో పొందుదామంటే నీకు చిక్కదు. నీ జ్ఞానంతో అనుభవంతో జీవితాన్ని చూడాలంటే జ్ఞాపకాల బరువును పెంచడమే అవుతుంది. ఆ విధంగా జ్ఞానం, అనుభవం క్రమంగా జీవితాన్ని నాశనం చేసేవే అవుతాయి. (LA-115)

## అనుభవం - అమాయకత

ఈర్ష్యే చూడండి, జ్ఞాపకం వల్లేకదా పాతుకుపోయింది. జ్ఞాపకాల రూపం జీవితంలో చాలా నాశనకరమైనది. అంటే అనుభవంలను నిత్యజీవిత విషయాలను మరచిపోమ్మని వాటి నుండి తప్పించుకోమని అర్థంకాదు. అనుభవాలతో నిండినవాడు తెలివిగల మానవుడు కాదు. అనుభవంతో ముడివేసికున్నవాడు ప్రజ్ఞావంతుడు కాదు, పుస్తకజ్ఞానం సంపాదించిన విద్యార్థిలాంటి వాడు. ప్రజ్ఞావంతుడు అమాయకంగా వుంటాడు. అతడు అనుభవన శూన్యుడు. అంతరంగాన సరళంగా వుంటాడు. బయటికి ప్రాపంచికమైనవి అన్నీ వున్నా లేక పోయినా.(LA-116)

## జ్ఞాపకం - భయం

మానవ సంబంధం నుండి ఎందుకు దూరంగా వుండాలనుకొన్నాం? మనకు గాయం తగుల్తుందేమోనని. అందుచేత భయమేర్పడింది. గతంలో గాయం తగిలిందన్న జ్ఞానం భవిషత్తులో గాయం తగుల్తుందేమోనన్న భయాన్ని కల్గిస్తుంది. అట్లా జ్ఞానం భయానికి కారణమౌతుంది. అయినా జ్ఞానం కావాలి.(LA-433)

## జ్ఞానం అడ్డు గోడ

నేను స్వేచ్ఛగా వుంటే నీవు మళ్ళీ గాయం కల్గించబోతున్నావు. కనుక జ్ఞానం అడ్డుకుంటుంది. గోడలావుంటుంది. మనుషుల మధ్య ఈ గోడ వున్నపుడు, మీకు నాకు మధ్య ఈ గోడ వున్నపుడు మానవ సంబంధంలో ఏం జరుగుతుంది?(LA- 434)

## గాయం

నన్ను గాయ పరిచావు. దాని జ్ఞానం మిగిలివుంది. ఆ జ్ఞానం నాకు లేకపోతే మళ్ళీ నీవు నన్ను గాయపరుస్తావు. ఆ జ్ఞానం బలపడితే నీకు నాకు మధ్య అది అడ్డుగోడగా పనిచేస్తుంది. కనుక నీకు నాకు మధ్య సంబంధం లేదు. కనుక గతాన్ని గూర్చిన జ్ఞానం మానవ సంబంధాన్ని అవరోధిస్తుంది. నేనేం చేయాలి?(AI-435)

## మనోబింబం

ఒకరు గాయపడ్డారు. ఎందుకు గాయపడ్డారు. మనసులో తనను గూర్చి తనకు ఒక అభిప్రాయం వుంది కాబట్టి. ఆ అభిప్రాయమెలావచ్చింది? సంస్కృతి, చదువు, నాగరికత, సంప్రదాయం, జాతీయత, ఆర్థిక స్థితిగతులు, సాంఘిక అన్యాయం మున్నగు వాటి ద్వారా యేర్పడింది. ఆ ప్రతిబంబమే గతం కనుక అదే జ్ఞానం. నా ప్రతిబింబాన్ని మరొక ప్రతిబింబంతో పోల్చుకునే జ్ఞానం మనసులో నాటుకుంది. అది ఆలోచనవల్ల జరిగింది. ఈ ప్రతిబంబం తల్లి, ఉపాధ్యాయుడు, రాజకీయవాది, క్రైస్తవం, పౌరాణికం ద్వారా తయారౌతుంది. మొత్తం నాగరికతే దీన్ని చేస్తుంది. అది ఆలోచనా రూపంలో వుంటుంది. ఈ ప్రతిబింబం వున్నంతకాలం గాయం తప్పదు అని గ్రహించడం అవగాహన అవుతుంది. (LA-439)

## ప్రతిబింబం వద్దు

గాయపరిచేదికాని, సంతోష పరిచేది కాని, ఏ ప్రతిబింబమైనా మానవ సంబంధానికి అవరోధం. నీయెడ సంతోషదాయకమైన ప్రతిబింబం వుంటే నీవు నాకు మిత్రుడవని, దుఃఖాన్ని కల్గించే ప్రతిబింబం వుంటే విరోధివని. అంచేత ప్రతిబింబమే వద్దు. దీన్ని అంగీకరించడం లేదు. అనుసరించి చూడాలి. దాన్ని పరిశీలించు, ఆచరణలో వుంచు. జీవించు. అలాంటప్పుడు గాయపడే మనసే లేదు. ఇంకా గాయపరిచేది దేన్ని?(LA-443)

## జ్ఞానాభ్యాసంలో సత్యముండదు

ఏ పేరు పెట్టినా సత్యమనేది ఎప్పుడూ నూతనంగా సజీవంగా వుండాలి.

"నూతనం" "సజీవం" అనే పదాలు ఆగిపోయిన స్థితి, చచ్చిన స్థితి, మానవుని మనస్సులో స్థిరీకరింపబడ్డ అంశం కాదని తెల్పడానికే వాడబడ్డాయి. క్షణక్షణం సత్యాన్ని క్రొత్తగా కనుగొనాలి. అది పునరుక్తం చేయదగ్గ అనుభవం కాదు. అది అలాగే కొనసాగేదీ కాదు. కాలంలేని స్థితీకాదు. సత్యం వుండాలంటే ఒక దానికి అనేకానికి మధ్య వుండే విభాగం సమసిపోవాలి. అది సాధించే స్థితీకాదు. మనసు లెక్కగట్టుకొని, పరిణామం చెంది నేర్పగలది కాదు. సత్యం పొందే వస్తువయితే, జ్ఞానాభ్యాసం, సంచయ కాంక్ష అవసరమౌతాయి. అలాంటప్పుడు గురువు, అనుచరుడు రంగప్రవేశంచేసే అవకాశమేర్పడుతుంది. గురువు తెలిసిన వాడుగా, శిష్యుడు తెలియని వాడుగా తయారవుతారు.(CLIII-4)



# అవగాహన భూమిక

బుద్ధితో అర్థం చేసికోవడమనేది యదార్థంగా అర్థం చేసికోవడమేకాదు. బుద్ధికి సంబంధించినవి మేధస్సు, తర్కం, వాదం, యుక్తి, సమర్థన, ఖండన. ఇవి సహాయకారులు మాత్రమే. అవగాహన హృదయానికి సంబంధించింది. అది అచ్చపు జీవితానికి సంబంధించింది. తక్షణ క్రియాశీలతతో కూడింది.

దేనియందైనా అయిష్టత కల్గినపుడు దానినుండి దూరం చేసే ప్రక్రియ కూడ వెంటనే మొదలవుతుంది. అట్లే ఇష్టత కల్గినపుడు చేరువయ్యే చర్య కూడ ప్రారంభమవుతుంది. రెండూ క్రియాశీలకమైనవే. కనుక తెలిసిన వెంటనే సహజంగా చర్య జరగడం అవగాహన. బస్సుగాని పాముగాని ఎదురైతే వెంటనే పక్కకు తొలగడం అవగాహన. తెలిసికున్న తర్వాత సాధనచేసి ధ్యేయాన్ని పొందుదామను కోవడంలో వ్యవధి వుంది. ఆ వ్యవధే సందిగ్ధానికి, తాత్సారానికి, ప్రలోభానికి, ప్రమాదానికి, స్వార్థానికి, వంచనకు దారి తీస్తుంది. ఆ వ్యవధి పెట్టుకోవడమంటే నిజంగా తెలియలేదనే అర్థం. చెడుఅని తెలిసినతరువాత మంచిగా మారడానికి కాలవ్యవధి కావాలా? మానసికమైన మార్పుకు సాధన దేనికి? భౌతికమైన పెరుగుదలకు, కాలంకావాలి, సాధన (కృషి) చేయాలి. మానసిక పరిణామానికి కూడ అవి అవసరమా?

అండర్‌స్టాండింగ్ (UNDERSTANDING) ను అవగాహన అంటున్నాం. అవగాహన ఒక క్రియ అన్నాం. ఎప్పటికప్పుడు గ్రహించడమనేదే ఆ క్రియ. అది అనుక్షణం సాగుతూ వుంటుంది. అది వర్తమాన క్రియాశీలకమై వుంటుంది. అంటే గతవిషయం కాదు. గతంతో సమన్వయం చేసికోవడమూ కాదు. భవిష్యత్తుతోముడి పెట్టడమూ కాదు. ఈ క్షణం జీవించడానికి అవసరమైన విషయం. ఏ క్షణాని కాక్షణం తాను తానుగా గ్రహింపు కల్గివుండడం. ఈ అవగాహనలో మెలుకువ వుంది. ఎరుక వుంది. ఇది జ్ఞాపకం మీద ఆధారపడింది కాదు. భౌతిక వ్యవహారానికి జ్ఞానం అవసరం. మానసికమైన మార్పునకు జ్ఞానంతో పనిలేదు. కనుక క్రియాత్మకమైన ఎఱుకను అవగాహన అనవచ్చును. అవగాహనలో అన్ని వేళల జ్ఞానం తప్పనిసరిగా అవసరమైన అంశం కాదు.

ఉద్రేకం కలిగినపుడు లేక కోపం వచ్చినపుడు మనసులో ఆందోళన చెలరేగుతుంది. ఆందోళనతో బుర్ర వేడెక్కుతుంది. అలాంటప్పుడు మెదడులో వుండే కణాలు తీవ్రంగా చలిస్తాయి; మార్పు చెందుతాయి. అవి మామూలు స్థితికి రావడానికి కొంత కాలం పడుతుంది. మళ్లీ మళ్లీ ఉద్రేకాలు వస్తే అలాంటి మార్పులు సంభవిస్తూ వుంటాయి. ఎల్లప్పుడూ ఆవేశానికి గురి అయ్యే మనిషిలో ఆకణాలు అందుకు అనుకూలంగా అమరిపోతాయి. స్థిరపడతాయి. అలాంటి వాళ్ళను కదిపితే చాలు వారు భగ్గుమంటారు. చీటికి మాటికి చీకాకు పడతారు. అలాగే అవగాహన బాగా కుదిరినపుడు మెదడు కణాలు తదనుగుణంగా మార్పు చెందుతాయి. కొత్తదనం వహించిపపుడు మార్పు ఏర్పడుతుంది. సదా శాంతిగ, హేతుబద్ధంగా, సమంజసంగా, యదార్థ దృష్టితో వుండే వాని మెదడు కణాల్లో మార్పు అలా స్థిరపడుతుంది. దాన్నే (MUTATION) పూర్తి పరిణామం (మానసిక రసాయనిక క్రియ) అంటారు. అవగాహనలో అలాంటి మ్యూటేషన్ జరుగుతుంది.

జ్ఞానం నిలవసరుకు. అవగాహన తక్షణ క్రియ. అది తెలివిని, ఎరుకను కల్గిస్తుంది. జ్ఞానం బుద్ధికి సంబంధించింది. అవగాహన హృదయానికి సంబంధించింది. అందులో ధీశక్తి కూడ వుంటుంది. అవగాహనకు జ్ఞాన సముపార్జన అవసరం లేదు కాని విశేష వివరణకు అలంకార ప్రాయంగా జ్ఞానం సహకరిస్తుంది. అవగాహనే జీవితం. ఆ జీవితం నిత్య చైతన్యవంతం.

అవగాహన యొక్క వైఖరి కొంత వరకు తెలిసింది. ఇక దాన్ని గూర్చి కృష్ణజీ చేసిన వివరణ తెలిసి కుందాం.:

-- జె.శ్రీ.

## కృష్ణజీ అవగాహన సృజనాత్మకం

అవగాహన సృజనాత్మకమైంది. అది స్మృతి కాదు. జ్ఞాపకంకాదు. విముక్తి నిచ్చేది అవగాహన. నిల్వసరకు విముక్తి నివ్వదు. అవగాహన జరగబోయేది కాదు. స్మృతి భవిష్యత్తును తెచ్చి పెడుతుంది. నిన్ను నీవు ముఖాముఖి చూడగలిగితే సమస్యలేదు. స్పష్టంగా చూడనపుడే సమస్య వుంటుంది. (LA-114)

## జ్ఞానం పరిమితం

సత్యం చెప్తున్నాను, అవగాహన సక్రమంగా వుంటే జ్ఞానాన్ని తగుస్థాయిలో వాడగలవు. అర్థంచేసికోకుండా, ప్రపంచంలో జ్ఞానాన్ని నీ స్థానాన్ని బలపరుచుకోవడానికి వాడితే అది నీ చురుకుతనాన్ని, సృజనశక్తిని పాడుచేస్తుంది. అధికారంతో ఇతరులు చెప్పిందాంతో, భగవద్గీత ప్రబోధంతో, అభిప్రాయల్తో బరువెక్కిపోయాం. అందుకే మన జీవితాలు జడమయమైపోయాయి. ఈ విషయాలు తెలిసినా, చైతన్యంగా జీవించరు. జ్ఞాపకాల బరువులున్నంత కాలం క్రొత్తదనమే లేదు. జీవితం నిరంతరం క్రొత్తది కనుక దాన్ని అలాంటి బరువులతో, అర్థం చేసికోలేం. కాబట్టే మన జీవనం భారంగా వుంటుంది. సోంబేరులమైపోతాం. భౌతికంగా, మానసికంగా లావెక్కిపోతాం, అసహ్యంగా వుంటాం. ఇది అర్థం చేసికోవడం చాల ముఖ్యం.(LA-115)

## జ్ఞానం వేరు అవగాహన వేరు

విషయాలు సేకరించడం వల్ల జీవిత అవగాహన కలగదు. జ్ఞానం వేరు అవగాహన వేరు, జ్ఞానం అవగాహనకు దారితీయదు, అయితే అవగాహన జ్ఞానాన్ని పెంచవచ్చు. జ్ఞానం అవగాహనకు ఆవరోధం కావచ్చు.(CLIII-3)

## అబద్ధాన్ని అబద్ధంగా చూపేది అవగాహన

అబద్ధాన్ని అబద్ధంగా అతి సూక్ష్మంగా చూడడమే అవగహనకు ఆరంభం. అర్థం చేసికోకుండా కొత్తగా ఏదో మొదలు పెట్టాలని వుంటే, వేరే భ్రమలో పడవచ్చు. ఒక ఫలితాన్ని, ఒక గమ్యాన్ని మరోవిధంగా సాధించాలనే కోర్కె మనల్ని గ్రుడ్డివాళ్ళను చేస్తుంది. కాని మనం కోరే ఫలితం స్వార్థం కేంద్రీకృతమైన క్షేత్రంలోనే వుంది. దాన్ని బాగా చూడ గలిగితే ఏదో సాధించాలనే ఆలోచనే వుండదు. అబద్ధాన్ని అబద్ధంగా నిజాన్ని నిజంగా చూడడమే విజ్ఞానం. (CLIII-7)

## అవగాహన - అనిబద్ధత

స్వేచ్ఛ లేకుండ, నిరాచ్ఛాదితమైన మనస్సు లేకుండ అవగాహన వుండనేరదు. జ్ఞానం వల్ల అవగాహన రాదు. మాటలకు, మాటలకు మధ్య నుండి, ఆలోచనకు

ఆలోచనకు మధ్య నుండి అవగాహన రావాలి. ఆ మధ్య కాలమే మౌనం. జ్ఞానం దాన్ని భంగపరచరాదు. అదే తేట తెల్లమైంది లేక విస్పష్టమైంది. అచింత్యమైంది, పరిపూర్ణమైంది.(CLi-206)

## మౌనం - సత్యం

మనసు తనయెడల తాను పూర్తిగా ఎరుక వహించినపుడు ఎంతో విశేషంగా ప్రశాంతి చెందుతుంది. మౌనం వహిస్తుంది. అది నిద్ర కాదు. ఆ నిశ్శబ్దతలో బాగా జాగృతితో వుంటుంది. అలాంటి మనసు సత్యమేమిటో చూడగలదు. ఆపైన ఏమైనా వుందో లేదో చూడ గలదు. అదే మతపరమైన సమరసభావంగల మనస్సు. ఎందుకంటే దానికి గతం పూర్తిగా పోయింది. అపుడు మతాన్ని మాటల్లో వర్ణించలేము, కొలవలేము. (BV-55)

## బుద్ధితో అర్థంచేసి కోవడం

బుద్ధితో అర్థం చేసికోవడమంటే అర్థం చేసికోవడమే కాదు. అంటే శబ్దాలు విని వాటి అర్థం తెలిసికోవడమవుతుంది. దానివల్ల క్రియ జరగదు. తృప్తికి, భద్రతకు ఇతరుల్ని వాడుకోవడం ప్రేమ అనిపించుకోదు.(CL-III-112)

## శబ్దార్థం

శబ్దార్థాలతో ఆగిపోవడమంటే బుద్ధితో గ్రహించడం. అందులో విలువ లేదు. అది విముక్తి నివ్వదు. విషయంలోని అసత్యాన్ని లేక సత్యాన్ని లోతుగా పరిశీలించడంలో విముక్తి వుంది. ఏకాగ్రతలో వున్న నిజ స్వరూపాన్ని అర్థం చేసికోవాలి. అందులో అవాస్తవాన్ని, వాస్తవాన్ని గుర్తించాలి. అపుడు ఏదో సాధించాలి, అనుభవించాలి, తయారు కావాలి అనే కోర్కెనుండి విముక్తి లభిస్తుంది. అవధానమేర్పడుతుంది. అది ఏకాగ్రతకు పూర్తిగా భిన్నమైంది. ఏకాగ్రతలో ద్వంద్వ విధానముంది. ఎన్నుకోవడముంది. ప్రయత్నముంది. అవునా, ప్రయత్నించే వాడున్నాడు, అంత్య ఫలముంది. ఆ ప్రయత్నపరుడే నేను 'ఆత్మ' అహం, జయకాంక్షి, పవిత్రుడు. ఏకాగ్రత ఆ అహాన్ని బలవరుస్తుంది. అవధానంలో ద్వంద్వ

వైఖరి వుండదు. అనుభవజ్ఞుడు అంటూ వేరుగా వుండడు, సమీకరించేవాడు, నిల్వచేసేవాడు పునరుక్తి చేసేవాడు వుండడు. ఈ సావధానత వల్ల సాధించే విషయంలో సంఘర్షణ వుండదు. విఫలమౌతుందనే భయం హరించి పోతుంది. మనకా అవధానశక్తి లేకపోవడం విచారకరం. (CEII-237)

## జాగృతి

మనం ప్రత్యేకంగా వొకరినుండి గాక, తటస్థించే ప్రతిదాని నుండి నిరంతరం నేర్చుకుంటున్నపుడు మార్గదర్శకత్వంతో అవసరముందా? క్షేమంగా, భద్రంగా సుఖంగా వుండదలచినపుడు మాత్రమే మనం మార్గదర్శకత్వాన్ని అన్వేషిస్తాం. మనకు నేర్చుకోవడంలో స్వేచ్ఛ వుంటే రాలే ప్రతీ ఆకు నుండి, కలిగే ప్రతీ సంబంధం నుండి నేర్చుకుంటాం. మనమనస్సుల్లో జరిగే క్రియలపట్ల జాగృతి వహించడం నుండి నేర్చుకుంటాం. కాని మనలో ఎక్కువ మందికి నేర్చుకోవడంలో స్వేచ్ఛలేదు. ఎందుకంటే చెప్పించుకోవడమే మనకు అలవాటు. పుస్తకాలు తల్లిదండ్రులు, సమాజం మనం ఏమి ఆలోచించాలో చెప్తుంటాయి. రికార్డయిన గ్రామఫోనులాగ మనం చిలక పలుకులు పలుకుతాం.(CLIII-245)

## ఎరుకే నేర్చుకోవడం

తనకున్న బంధమేమిటో మనస్సు గ్రహించగలదు. ఆ ఎరుకలోనే నేర్చుకోవడముంది. కాని బోధనతో గుడ్డిదై పోతే, మనసుకు నేర్చుకొనే సామర్థ్యమే వుండదు. ఇది తెలుసా? (CLIII-246)

## సంప్రదాయం - అహం

నేర్చుకోవడమనేది ఎప్పుడూ జరుగుతూ వుంటుంది. ఒక నిర్దేశిత బిందువు నుండి మరొక బిందువుకు కాదు. గతంతో, నిర్ణయాలతో, సంప్రదాయాలతో, నమ్మకాలతో బరువెక్కిన మనసుకు నేర్చుకోవడమనే చలనముండదు. ఈ సమీకరణను బ్రహ్మ, ఆత్మ ఉన్నతాత్మ, అని వేరు పెట్టినా అది 'నేను' అనబడే అహమే. అహం, నేర్చుకోవడమనే గమనాన్ని నిరోధిస్తుంది. (CLIII-246)

## అవగాహనే క్రియ

ఇది ఆదర్శం కాదు, ఊహాత్మకంగా దూరతీరాలలో, లేని ప్రదేశంలో సాధించేదేదో కాదు. అవగాహన ఇప్పుడు వుంటుంది, భవిష్యత్తులో కాదు. అవగాహనే క్రియ. అవగాహనముందూ, ఆచరణ తర్వాత జరగదు. క్రియ వెలుగు అవిభాజ్యమైనవి. తక్షణ ప్రకాశమే సత్యదర్శనం- పామును చూడగానే క్రియ వుంటుంది. మనం మాట్లాడేదానిలోని సత్యాన్ని దర్శించడంలో క్రియ దాగి వుంది. కాని మనం మాటల్లో చిక్కుకు పోయాం. బుద్ధికి సంబంధించిన ఉద్వేగ విషయాల్లో పడిపోయాం. ఆ మాటలు, బుద్ధి క్రియాశీలతకు అవరోధమైనాయి. బుద్ధితో అర్థం చేసికోవడమనేది శబ్దాల వివరణ వినడం మాత్రమే అవుతుంది. అలాంటి అర్థంలో తాత్పర్యంలో ప్రాముఖ్యత లేదు. ఆహారం గూర్చిన వర్ణన ఆకలిగొన్న వారికి ప్రయోజనమివ్వదు, ఆకలి తీర్చలేదు కదా. అవగాహన చేసికోవడమో, చేసికోకపోవడమో వుంటుంది; కాని సగం సగం వుండదు. అవగాహన అనేది సమగ్రమైన ప్రక్రియ. అది క్రియకు లేక ఆచరణకు వేరైంది కాదు. అది కాల ప్రభావం కూడ కాదు.(CLIII-48)

## అవగాహనే మార్గం

'ఎలా' అనే దానిలో క్రమంగా స్వేచ్ఛ పొందడమనేది ఇమిడి వుంది. అయితే గందరగోళం బిట్టు బిట్టుగా అంచెలంచెలుగా తీరేది కాదు. మనసంతా గందరగోళంగా వుండి, ఒక భాగంలో మాత్రం అది తీరితే, మళ్లీ గందరగోళంలో పడ్డట్టే. అవతలి వొడ్డును గూర్చిన చింతనలో మనసు వున్నపుడు మాత్రమే ఈ గందరగోళం 'ఎలా' తీరాలా అనే ప్రశ్న వుదయిస్తుంది. ఎక్కడో తెలదామనుకుంటే అవగాహన యొక్క ప్రాముఖ్యత చూడలేవు. ద్వేషం గురించి నీకు సంపూర్ణ అవగాహనవుంటే దాని ప్రతిఫలమైన దుఃఖం కూడ నీ అవగాహనలో వుంటే దాని నుండి తొలగడం ఎలా అని అడగవు. ద్వేషాన్ని అవగాహన చేసికోవడమనేదే సమగ్రమైన క్రియ. 'ఎలా' అనేది క్రమంగా స్వేచ్ఛను పొందడమవుతుంది. అంటే అది మళ్లీ గందరగోళమే.(CLIII-50)

## ఆలోచన - అవగాహన

ఆలోచనకు స్మృతి కారణం. అవగాహనకు ఆలోచనతో పనిలేదు. ఆలోచనా ప్రక్రియలో "నాకు అర్థం కాలేదు" అనే వరకు నీవు కారణాలు వెతక వచ్చు, తర్కించవచ్చు. అర్థమైతే మౌనం వహిస్తావు. అపుడు 'ఆ! నాకర్థమయింది'. అంటావ్. ఆ అవగాహన ఆలోచనా ఫలితం కాదు. (AL-30)

ఆలోచన ఎప్పుడూ స్వతంత్రమైంది కాదు. తెలిసిన క్షేత్రంలోనే అది పనిచేస్తుంది.(VB-55)

## ఉన్నస్థితి

నీవు అసహ్యంగా వున్నావనుకో, అందంగా వుండాలనుకుంటావు. ఎలా వున్నావో గాకుండ అందంగా వుండాలనే స్థితినే వూహించు కుంటావు - అట్లా నిన్ను నీవు వంచన చేసికుంటావు - దాంతోనే మనసు వడలిపోతుంది. కాని "నాస్థితి ఇది, ఇది వాస్తవం, నేను పరిశీలించి దీన్ని అవగాహన చేసికోవాలి" అని అనుకుంటే అపుడు దాన్ని దాటిపోగలవు. ఎందుకంటే నీ స్థితి నిజంగా నీకు తెలిస్తే అది నీకు శాంతిని, తృప్తిని, లోదృష్టివి ప్రేమను అనుగ్రహిస్తుంది. (CH-82)

## భయం ప్రేమను చంపేస్తుంది

నీకు నీవు అర్థం చేసికోకుండా పెద్దల వత్తిడికి లోబడ్డావనుకో, నీమనస్సును నీవు అణచి వేస్తావు. దాంతో భయమొచ్చి పడుతుంది. ఆ భయం నీడలాగ జీవితాంతం వెన్నాడుతుంది. అందుకే ఏ ప్రత్యేక పద్ధతిననుసరించి క్రమశిక్షణకు లోబడకుండా వుండడం చాలా ముఖ్యం. మనలో ఎక్కువ మందికి ఆ పద్ధతులే కావాలి. ఏదో నీ మంచి కొరకు అలాంటి వన్నీ చేయమంటారు. ఈ ప్రక్రియ నీమృదుత్వాన్ని, అర్థం చేసికొనే సామర్థ్యాన్ని, ప్రేమను నాశనం చేస్తుంది. వత్తిడిని కాదనడం చాల కష్టం. ఎందుకంటే నీ ప్రపంచం చాల బలమైంది. దానికి లోబడి అవగాహన లేకుండా అనుసరించడం జరిగితే మందబుద్ధివై పోతావు. దాన్నుండి తొలగడం ఇంకా కష్టమౌతుంది. (LH-96)

## బలవంతం లేదు

తన్నుతా దెలిసికోవడం బలవంతంగా వీలు కాదు, అవగాహన చేసికోవడం బలవంతంగా వీలు కాదు. ఉపాధ్యాయునికి, తల్లిదండ్రులకు, మీకు నాకు ఇది పెద్ద సమస్య. ఇది గ్రహిస్తే మనం సక్రమమైన పాఠశాలలు సృష్టించగలం. (TMC-21)

పెద్ద వాళ్ళకు ఈ గొడవలేమీ తెలియవు. తెలియని వాళ్ళు పిల్లల ముందు మాట్లాడకుండా వుంటే మంచిది. దానికి బదులు స్వేచ్ఛగా, నిర్భయంగా పెరిగే వాతవరణం సృష్టించడానికి సాయపడితే మంచిది. (TMC-22)

## ఈర్ష్య తొలగడం

నా స్థితికి నేను అసహ్యపడి నీలాగ కావాలనుకుంటున్నా. కాని నా అసంతృప్తిని అర్థం చేసికుంటే, దానిక్కారణం అవగాహన చేసుకుంటే నీలాగ వుండాలనుకోను. నీకున్న వాటి గూర్చి కాంక్షించను. మరో విధంగా చెప్పాలంటే నన్ను నేను అర్థం చేసికోవడానికి ప్రయత్నిస్తే ఇతరులతో పోల్చుకోవడంగాని ఇతరుల గూర్చి ఈర్ష్య చెందడం గాని వుండదు. మార్పు చేసి కొని ఇతరుల్లాగా తయారు కావాలి అని అనుకొన్నపుడే ఈర్ష్య ప్రవేశిస్తుంది. ఎలా వున్నా సరే, నన్ను నేను అర్థం చేసికోవాలి; అని అనుకొంటే అపుడు ఈర్ష్యతొలగిపోతుంది? వేరే క్రమ శిక్షణతో పని లేదు. నేనేమిటో అవగాహన చేసికోవడం నుండి సమగ్రత చేకూరుతుంది.(TMC-104)

## నిజావగాహన

ఆత్మ నిజావగాహన వున్నపుడు జ్ఞానానికి తగిన స్థానం వుంది. ఈ అవగాహన లేకపోతే జ్ఞాన సాధన ఏదో పొందాలనో, ఎక్కడికో పోవాలనో భావాన్ని కలుగ జేస్తుంది. ఇది ప్రపంచంలో విజయం లాగ ఉద్వేగంగా, పుల్లాసంగా వుంటుంది. ప్రపంచంలో బాహ్యావస్తువుల్ని వదిలేయవచ్చు. కాని "ఆత్మ" జ్ఞానం పొందాలనే కుమ్ములాటలో ఫలాపేక్ష భావం వుంటుంది. వేటగానికి తాను వెంటపడేదాన్ని ఎలాగైనాసరే పట్టుకోవాలని వుంటుంది. అది ప్రాపంచిక లబ్ది పట్ల

తృప్తి పొందినట్లవుతుంది. తనస్థితిలో వున్న దానియొక్క అవగాహన ద్వారా తన్ను, 'నేను' అనేదాన్ని, 'అహం' అనేదాన్ని అవగాహన చేసికోవడమే వుండదు. జ్ఞానంతో మనసు బరువెక్కి వున్నంత వరకు నిత్యదినచర్యల్లో వంచన చేసే ప్రతి యొక్క క్రియ ద్వారా ఆత్మను - తన్నుతాను - అవగాహన చేసికోవడం సాధ్యం కాదు. మానసికమైన బరువే జ్ఞానం యొక్క ఫలమైనపుడు అది ఎప్పుడూ కొత్తగా వుండలేదు. నీతివంతంగా వుండలేదు. (CLIII-125)



# పోలిక - పోటీ

జీవితంలో పోల్చి చూడడం ప్రధానమైపోయింది. ప్రతిదీ పోల్చి చూస్తారు. పోల్చి విలువ కడతారు. పోల్చి మాట్లాడతారు. ఈ పోలిక విడరానంతగా ముడివడిపోయింది. పోల్చకపోతే ప్రగతి ఎలా సాధ్యం అని ప్రశ్నిస్తారు.

పోల్చడమెందుకు? పోల్చకుండా జీవించడం కుదరదా? పోలికవల్లనే కృషి పుట్టుకొస్తుందా? పోలికలో ఇమిడి వున్న అంశాలేమిటి? పోలిక ఇద్దరు మనుషుల మధ్య, రెండు వస్తువుల మధ్య, రెండు భావాల మధ్య మాత్రమే జరుగుతుందా, లేక తనలో తనకు కూడ వుంటుందా? ఈ విషయాల పరిశీలన అవసరం. దాని లోతుపాతులు తేట తెల్లంకాగలవు.

పోలికలో ఉన్న అంశాలేమిటో చూద్దాం. రెండు వస్తువులను తీసికొని వాటి గుణాలు వివరించవచ్చు. అది పోలికకాదు. ఇద్దరిమనుష్యుల స్వభావం చెప్పవచ్చు. అదీ పోలిక కాదు. పొట్టి పొడవులుగాని, లావుసన్నాలుగాని, బరువు తేలికలు గాని విడమరచి చూడవచ్చు. అంతమాత్రాన పోలికకాదు. ప్రధానంగా భౌతికమైన వ్యత్యాసాలకు మానసికమైన విలువలు కట్టినప్పుడు పోలిక ఏర్పడుతుంది. అదే పోలికలో అసలు సమస్య. మంచిచెడ్డలు, హెచ్చుతగ్గులు, పుణ్యాపాపాలు అంటగట్టి నపుడు ఆ తారతమ్యాలు మనసుపై పని చేస్తాయి. ఘర్షణ మొదలవుతుంది. ఏవస్తువు గుణాలు ఆ వస్తువుకు ఉంటాయి. ఉపయోగాన్ని బట్టి పనికొచ్చేది, పనికిరానిది అని నిర్ణయిస్తాం. పోటీతో పనిలేదు.

పోల్చి విలువ కట్టడం నుండి ఈర్ష్య పుట్టుకొస్తుంది. ద్వేషం దాని తోబుట్టువు. ఏ పోలిక ఈర్ష్య ద్వేషాలు కల్గిస్తుందో ఆ పోలిక అవాంఛనీయం. పోలికతో విలువ కట్టుట వల్ల ఆశానిరాశలు ఏర్పడతాయి. ఆశలో భయముంటుంది. నిరాశలో కృంగి పోవటముంటుంది. అంతేకాదు. ఆశలో ప్రలోభం, భయంలో అపోహ చోటు చేసుకుంటాయి. ఇవన్నీ మనసు మీద పనిచేస్తాయి.

పోలిక ఆదర్శాన్ని సృష్టిస్తుంది. తాను కూడ పలానా విధంగా వుండా లనిపిస్తుంది. ఆదర్శమెప్పుడు భవిష్యత్తుకు సంబంధించిందే. ఆదర్శం, ఉన్న స్థితిని దాటవేస్తుంది. ప్రస్తుత కర్తవ్యానికి కన్ను గప్పుతుంది. ఆదర్శం అనుసరణకు

అనుకరణకు దారి తీస్తుంది. ఏదో సాధించాలనే తాపత్రయంలో పడిపోతాడు. మనిషి, స్వేచ్ఛ కోల్పోతాడు.

పోలిక యొక్క మరో పర్యవసానం పోటీ. ఒక దాన్ని అధికమించడం, ఒకరిని జయించడం పోటీ యొక్క ఉద్దేశం. పోటీ మనస్తత్వం వ్యత్యాసాలను ఇంకా పెంచుతుంది. పోటీ ద్వేషానికి పుట్టిల్లు. పోటీ గుణంలోనా, పనుల్లోనా? అవసరాన్నిబట్టి మనిషి పని చేస్తాడు. అవసరం చూపి ప్రోత్సహించాలి, పోటీ పెట్టికాదు. పోటీవల్ల ఘర్షణ.

పోటి లేనిదే ప్రోత్సాహముండదు, ప్రోత్సాహంలేందే పురోభివృద్ధి వుండదంటారు. అందుకు గాను పోటిలో నెగ్గడానికి బహుమతుల ఆశ జూపుతారు. బహుమానం మీద, ప్రతిఫలం మీద దృష్టి పెట్టుకొని పనిచేయడం వల్ల ఒక విధమైన ప్రవృత్తి, టెన్షన్, ఆదుర్దాలు ప్రవేశిస్తాయి. పోటీలేని కృషి సహజంగానే ఆనందదాయకంగా వుంటుంది. పోటితో కూడిన కృషిలో అదనపు ఆశ జనిస్తుంది. దాని వల్ల కల్గే నష్టం అందరికి తెలిసిందే.

పోటీలో సాధనవిఫలమైతే వచ్చే మానసిక వ్యాకులత అంతా ఇంతా కాదు. ఎన్నో అనర్థాలకు అహంభావం మూలమని అందరికీ తెలుసు. ఈ అహంభావం మనసు పొంగినా పని చేస్తుంది, మనసుకుంగినా పనిచేస్తుంది. అది పెరిగి నా ప్రమాదమే, అది దెబ్బతిన్నా ప్రమాదమే. అది లేనపుడే ప్రసన్నత!

వ్యక్తి ఆసక్తి ననుసరించి వికాసానికి ఎంతైనా దోహదపడడం అవసరం. అంతే గాని పోటీ పెట్టి నిర్ణయించడం వల్ల నిజమైన వికాసం కలగదు. ఎవరికి వారే స్వేచ్ఛగా పెరగాలి. పోటీవల్ల ఇమేజ్ పెరగవచ్చు గాని హృదయం పెరగదు. హృదయం ప్రేమకుస్థానం. పోటీ ప్రేమకు విరోధి.

పోటీలో 'స్పోర్ట్‌మన్ స్పిరిట్' అనేది నేతి బీరకాయ సామెత లాంటిది. పోటీ ఈర్ష్యా ద్వేషాపేక్షలతో కూడుకొన్నపుడు సమరస భావానికి తావెక్కడుంటుంది.? జయించడం, అధిగమించడం ప్రధానమైనపుడు 'స్పోర్టివ్' గా, అంటీ అంటనట్లుగా, పొంగుకుంగులు లేకుండా ఉండడం ఎలా సాధ్యం? పోటీలో స్వాభావికంగా స్పర్థ ఇమిడి వుంది. 'పోటీపడండి; స్పర్థ లేకుండ ఉండండి' అనడం విరుద్ధవచనం. అందుచే అందులో హానివుంది.

--జె.శ్రీ.

# కృష్ణజీ మాటల్లో

## పోలిక లేని వ్యవహారం అవసరం

వర్తమానాన్ని నిరంతరం గతంతోను, భవిష్యత్తుతోను పోల్చడం వల్ల, మనసుకు బాధ, కృశింపు కల్గుతాయి. అవును కదా! ఈ పోలిక నీ వర్తమాన స్థితి యొక్క వాస్తవికత నుండి నిన్ను అవరోధిస్తుంది. గతం ఎన్నటికి రాదు. భవిష్యత్తును నిర్ధారించలేవు. కనుక నీకున్నది వర్తమానమే. వర్తమానంలో సరిపోయినంతగా ఎప్పుడు వ్యవహరించగలవంటే, గత స్మృతుల బరువు నుండి, భవిష్యత్ భ్రమల నుండి మనసు స్వేచ్ఛపొందినపుడే. పోలిక లేకుండ మనసు వర్తమానంపై అవధానం వహిస్తే అన్యమైంది గోచరించే అవకాశం వుంది (Col II-196)

## పోల్చటం ఆలోచనా విధానం

విలువ కట్టడం, ఖండించడం, పోల్చడం- ఇవన్నీ ఆలోచనా విధానం. ఈ ఆలోచనా విధానం ఏ ప్రయత్నం వల్ల ఏ పద్ధతివల్ల అంతం అవుతుందని అడిగావంటే, ఏదో సాధించాలని కోరుతున్నట్లేకదా! ఒక విధానం అభ్యాసం చేయాలనే తాపత్రయం లేదా ఇంకా కృషి సల్పాలనే తాపత్రయం విలువకట్టడం నుండి పుట్టిందే. అది కూడ మనస్సు యొక్క ప్రక్రియే. పద్ధతి ననుసరించడం వల్ల గాని, ఏదో కృషిచేయడం వల్లగాని ఆలోచన అంతం కాగలదా? అసలు ప్రయత్నం ఎందుకు చేస్తున్నాం?(Col II-220)

## ఆలోచన అంతం కావటం

ఒత్తిడి నిచ్చే సంకల్పం యొక్క, కోర్కె యొక్క, తాపత్రయం యొక్క క్రియ మనసు నుండి పుట్టిందే. విలువ గట్టే మనసు నుండి, ఖండించే మనసు నుండి పుట్టిందే ఈ సత్యాన్ని మనసు దర్శిస్తే అంటే వాదనవల్ల, ఆత్మ విశ్వాసం లేదా నమ్మకం వల్ల గాకుండ సరళంగాను, సావధానం గాను దర్శిస్తే ఆలోచన అంతాని కొస్తుంది. ఆలోచన అంతం కావడం అంటే నిద్ర కాదు. జీవితం నిర్వీర్యం చేయడం కాదు; అది కాదు ఇదికాదు అనే వ్యతిరేక స్థితి కూడ కాదు. ఇది పూర్తిగా వేరైన స్థితి (Col II-220)

## పోలిక ఎప్పుడుపుడుతుందీ ?

పోగుచేసి కోవడం వున్నపుడే పోలిక పుడుతుంది. నేర్చుకున్న ప్రతి దాని పట్ల విస్మృతి (మరణం) కలగడమే నేర్చుకోవడం. ఈ మరణం చివరి పని కాదు; క్షణ క్షణం మరణించడం.

## పోలిక వల్ల బుద్ధి మాంధ్యం

నిన్ను మరొకనితో పోల్చినపుడు నిన్ను అర్థం చేసికోవడం లేదన్నమాట. నీపైన కేవలం తీర్పుచేస్తున్నాను. నీవు ఇదో అదో అంటున్నాను. కాబట్టి పోలిక ఉన్న చోట పుట్టుకొచ్చేది బుద్ధి మాంద్యమే. ఎందుకంటే ఈ పోలిక వల్ల మానవత్వపు హుందాతనం లోపిస్తుంది. పోల్చకుండా నిన్ను చూడ గలగాలి. నిన్ను అర్థం చేసికోవడం మాత్రమే నా పని. అర్థం చేసికోవడంలో పోల్చడమనేది లేదు గనుక అక్కడ ప్రజ్ఞ, మానవ హుందాతనం ఉంటాయి. (LA-80)

## పోలికలో ప్రేమ లేదు

మనసు పోలుస్తున్నంత సేవు, ప్రేమ లేదు. మనసు ఎప్పుడూ పోలుస్తూ, తూకం వేస్తూ తీర్పుచెపుతూ వుంటుంది. అవునా? ఎక్కడ బలహీనత వుందా అని చూస్తుంది. ఎందుకంటే ప్రేమ లేదు గనుక. తల్లిదండ్రులు పిల్లలను ప్రేమిస్తున్నపుడు ఒకరిని మరొకరితో పోల్చరు. కాని నీ వెప్పుడూ మేలైన వానితో, గొప్పవానితో, ధనవంతునితో పోలుస్తుంటావు. ఎప్పుడూ పోలికతో కూడిన సంబంధం పెట్టుకోవడమే నీ పనిగావుంది. కాబట్టి ప్రేమ లేని స్థితి నీకు నీవే సృష్టించుకుంటున్నావు. ఈ విధంగా మనసు మరింత పోల్చుకొనేది, మరింత సంపాదించుకొనేది, మరింత ఆధారపడేది అయింది. దాంతో ఒక పద్ధతి స్థిరమౌతుంది. అందులోచిక్కుకు పోతుంది. దేన్నీ కూడా నూతనంగా, తాజాగ చూడలేదు. గనుక జీవిత పరిమళాన్ని అనగా ప్రేమను నాశనం చేస్తుంది (LA-81)

## పోలిక కేవలం బుద్ధీకరణం

కేవలం గుర్తుంచుకుంటే ఎప్పుడూ పోల్చుకోవడమే అవుతుంది. పోలిక అసూయను

కల్పిస్తుంది. సంపాదనతో కూడిన మన సంఘం పోలిక మీద ఆధారపడి ఉంది. పోలిక ఎన్నటికీ అవగాహన ఇవ్వదు. అవగాహనలో ప్రేమ వుంది. పోలిక కేవలం బుద్ధీకరణం; అనుకరణ, అనుసరణతో కూడిన మానసిక ప్రక్రియ. అందులో నేత అనుచరులు ఏర్పడే ప్రమాదం వుంది. ఇది గ్రహిస్తున్నారా? (LA-101)

## పోలిక ఘర్షణకు ప్రేరణ

పోల్చిన క్షణమే ఘర్షణ మొదలవుతుంది, అసూయ పుడుతుంది, సంపాదించాలనే కోర్కె పుడుతుంది, ఒకడిని మించిపోవాలనే కాంక్ష ఏర్పడుతుంది. (TAI -80)

## పోలిక - ఆదర్శం- ప్రేమ

కాబట్టి "ఉన్నదాన్ని" అర్థం చేసికోవడం వల్ల - "ఉండవలసినదాం"తో పోల్చుకోవడం వల్ల కాదు- మంచితనం వికసిస్తుంది. మంచితనానికి ఆలోచనతో ఎంత మాత్రం పనిలేదు కదా! ప్రేమకు ఆలోచనతో ఏమైనా సంబంధం వుందా? "నా ప్రేమాదర్శం అది" అని సూత్రం సృష్టించి ప్రేమను అభ్యసించగలవా? ప్రేమను అభ్యసిస్తే ఏమౌతుందో తెలుసా? నీవు ప్రేమించడం లేదు. ఏదో రాబోయే తేదీ నాటికి ప్రేమ కలుగుతుందని అనుకుంటావు. ఈ లోపున నీవు కర్కశంగా వున్నావు. కాబట్టి మంచితనం ఆలోచన యొక్క, ప్రతి ఫలమా?

ప్రేమ అనుభవం యొక్క, జ్ఞానం యొక్క ప్రతిఫలమా? (TAI-85)

## పోటీ- సంబంధం

తన చుట్టూనూ తనలోనూ పెంచుకొన్న ఉహారూపక నిర్మాణం, దాని స్వభావం మీకు తెలుసో లేదో. ప్రతిమనిషి ఈ చిత్రణ నిరంతరం చేస్తున్నాడు. అలా చేస్తే మరొకరితో సంబంధం ఎలా కుదురుతుంది? వ్యక్తిగతంగా ఈర్ష్య, పోటీ ఆశ, వాటికి సంబంధించిన వన్నీ ఉంటే సంబంధం ఎలా కుదురుతుంది? ఇవన్నీ మన సమాజంలో చోటు చేసికున్నాయి, పెంపొందుచున్నాయి. ప్రతివారూ ఎవరికి వారు వ్యక్తిగతంగా సాధించాలని, విజయం పొందాలని సదా వెంటబడుతుంటే సంబంధంఎలా ఏర్పడుతుంది? (TAI-16)

# గురువు - శిష్యుడు

గురువు విషయం చాలా పెద్దది ఎందుకంటే గురుత్వం అన్నది సనాతనంగా పాతుకుపోయిన వ్యవస్థ. బహుకాలంగా స్థిరపడింది కాబట్టే బహుదోషాలుండడం సహజం. ఆ దోషాలు గుణాలను అధిగమించి పని చేస్తున్నాయి. కారణం మూలంలోని వుద్దేశం కంటే చాలా కాలంగ ఉన్న వ్యవస్థ ప్రధానమై పోయింది. ఇపుడు దాన్ని కాదనడం ఒక విడ్డూరం! కాని ఎందుకు కాదనాల్సివస్తోంది?

గురువంటే పెద్దవాడు, గురుతు చూపించేవాడు, అంధకారం తొలగించేవాడు అని అర్థాలు చెప్పుతారు. పెద్దవాడు కావచ్చు, అంటే అనుభవజ్ఞుడు కావచ్చు, బోర్డులాగ మార్గం సూచించవచ్చు. కాని ఇతరుల అంధకారం తానెలా తొలిగించ గలడు? ఎవర్ని వారే ఉద్ధరించుకోగలరు. కాకపోతే సహాయం పొందొచ్చు. అంతవరకే!

మార్గం చూపిన బోర్డును మరచిపోవచ్చు. స్మరించుకోవలసిన పని లేదు. ఆరాధించాల్సిన పని అంతకన్నాలేదు. మరి ఈపూజలు, ప్రార్థనలు, పాదనమస్కారాలు, తీర్థప్రసాదాలు ఏమిటి, ఎందుకు? గురువే బ్రహ్మ, గురువేదైవం, గురువే సర్వస్వం అన్నపుడు అతిశయోక్తితో కూడిన ఊహాత్మక విలువల్పొడమైంది. కవిత్వం లాగ విశ్వాసం రెక్కలు కట్టుకుంటుంది, హద్దులేకుండా ఎగిరిపోతుంది. వాస్తవమయితే గదా పరిమితిగా తెలియడానికి?

'గురువు' అన్న పదం చెవినిపడగానే దానిచుట్టూ విస్తరించిన భావం గో చరిస్తుంది. దారిలో మట్టిపుట్ట కనపడగానే దండం పెట్టడంలా వుంటుంది. శబ్దో చ్చారణలోనే గౌరవం సంతరించు కొంటుంది, ఘనత చాటుకొంటుంది, సనాతనత సిద్ధిస్తుంది. ఆ శబ్దం ఒక కట్టుబాటు తనాన్ని కల్గిస్తుంది. అయితే ఒక దండం పడేసిదులుపుకు పోయే తత్వం కూడ మనిషికేర్పడింది. ఇపుడా పదం తెలిసిన తనానికి, సేవచేయించుకోడానికి, అధికారానికి, దాంతోవచ్చే అహంకారానికి, బతుకు తెరువుకు, కీర్తికి ఆశ్రయమైంది. అమాయకులకేగాక, ఆశాపరులకు కేంద్ర మయింది. మధ్య వర్తిత్వానికి మారుపేరయింది. గురువు దివ్యత్వానికి సంకేతంగా వాడ బడుతున్నాడు. ఎక్కడ అవాస్తవం చోటు చేసుకుంటుందో అక్కడ పతనం మాటు వేస్తుంది. తెలియకుండా వేళ్లను తినివేస్తుంది.

ఇక్కడ గురువంటే బడిలో పాఠాలు చెప్పే ఉపాధ్యాయుడనికాదు. ఆధ్యాత్మిక గురువు, పురోహితుడు,ప్రీస్టు, ఫకీరు మున్నగు వారు. వీళ్లు ప్రత్యేక జ్ఞానవంతులనీ, మధ్యవర్తులనీ, శక్తిమంతులనీ, మంత్రసిద్ధులనీ ప్రతీతి. ఆరోపితమైన వీరి ప్రత్యేక లక్షణం శిష్యులపై ఆధిపత్యాన్నిస్తోంది. గురువు తన తెలిసిన తనాన్నీ శిష్యుడు తన తెలియని తనాన్నీ ప్రాథమికంగా నమ్ముతున్నారు. వారి సంబంధం విభేదంతో మొదలవు తోంది, విభేదంతో కొనసాగుతోంది. లౌకిక అధికారాల లాగానే ఆధ్యాత్మిక అధికారం కూడ చెరుపే. అది అహంకార పోషకం, సంపాదనా మూలకం. అధికారం ఎంత పెరిగితే ప్రేమ అంత తరుగుతుంది. నేటివ్యవస్థలో సాధికారగురు-శిష్య సంబంధం బ్రతుకు తెరువుకు, ధన ప్రయోజనానికి, పేరు ప్రతిష్ఠలకు దారి తీయడం లేదా? "మీరు త్యాగం చేయండి, మాకు ఇచ్చేయండి" అని బోధించే గురువులులేరా?

ఇకపోతే మధ్యవర్తుల పాత్రేమిటి? పూజారి ప్రమేయ మేమిటి? తల్లి కనేటప్పుడు-బిడ్డపుట్టేటప్పుడు మంత్రసానికి కొంతపనివుంది. ఆమాత్రం సహాయం తప్పనిసరిగా చేయాలి; బొడ్డైనా కత్తిరించాలి. 'దేవుడు' అనుగ్రహించేటప్పుడు, 'భక్తుడు' పొంద గల్గినప్పుడు మధ్యలో అందిపుచ్చుకొనే వాడొకడుండాలా? అందించే వాడుండాలా? శాస్త్రాలు తెలిసుండవచ్చు, వివరణలు అందించవచ్చు. అంతమాత్రాన దివ్యత్వం కిరీటంలా వచ్చి పడదు గదా! అదేచేయాల్సి వుంటే అది బడిపంతుల పాత్రేకదా! పోనీ ఏదేని అనుభవంవున్న అది అనుభవించేదేగాని అందించేది కాదే. నేర్చుకోవడమనేది అనేకుల నుండీ అనేకం నుండీ వుంటుంది. అవగాహన అనేది సరాసరి, ముఖాముఖీ, ప్రత్యక్ష దర్శనంతో వుంటుంది. అది స్వయంగా సిద్ధించేది. మధ్యవర్తిత్వం వేరైంది. కాబట్టి అది స్వయంసృష్టి, స్వార్థపూరితం అనిపిస్తోంది. గురువు శిష్యులకు కట్టుబడి పోతున్నాడు; వాళ్లుకోరేదే చెపుతున్నాడు; వాళ్ల మెచ్చే రీతిలో తన శైలిమార్చుకుంటున్నాడు; చెప్పడంలో శబాష్ అనిపించుకోడానికి ఎక్కువమంది తాపత్రయ పడుచున్నారు; ఇదోరకం బంధం; ఒక దోపిడీ. శిష్యులకు స్వేచ్ఛ ఇవ్వగల్గిన గురువు, తానూ స్వేచ్ఛ పొందుతాడు; అపుడు గురువు అర్థమూ విధానమూ మారిపోతాయి. ఈ విషయాలింకా సూక్ష్మంగా చూడాలి. అందుకు కృష్ణజీని చదవండి.

--జె. శ్రీ.

# కృష్ణజీ :

## సహకారం అధికారంలో లేదు, ప్రేమలోనే:

వికసించిన అనుసరణ అంటూ లేదు; అనుసరణ అంతా అరిష్టమే ఉన్నత స్థానాల్లో గానీ అనాలోచితులలో గానీ అధికారం అవినీతిని కల్గిస్తుంది. అనాలోచితులు ఇతరులననుసరించుట వలన ఆలోచనాపరులుకాలేరు. ఇతరుడు ఎంత గొప్పవాడైనా సరే, ఘనుడైనా సరే(COLii-177)

ఇష్టంగానీ అయిష్టంగానీ అధికార ప్రభావం ఒకప్రక్క వత్తిడి చేస్తుంటే దాన్ని సహకారం అంటామా? ఇతరుడు ఇచ్చిన పథకం ప్రకారం నువు పనిచేస్తున్నపుడు అది సహకారమా? భయము భూషణాపేక్ష మొదలగు వాని ద్వారా తెలిసో తెలియకో అప్పటికది సర్దుకుపోవటం కాదా? అనుసరణ సహకారం అవుతుందా? మేలైంది కాని బాధాకరమైంది గాని నీపై అధికారమున్నపుడు సహకారం ఉంటుందా? అసలు ఒక వస్తువు పై ప్రేమ ఉన్నపుడు మాత్రమే సహకారం తప్పక లభిస్తుంది. ఆ ప్రేమ దానంతటకది వుండాలి దండన వల్లో అపజయం వల్లో కలిగే భయం లేనిదిగా వుండాలి; విజయం పట్ల గానీ గుర్తింపు పట్లగానీ ఆరాటం లేకుండా వుండాలి. ఈర్ష్య, సంపాదన, అధికారకాంక్ష (వ్యష్టిగా గానీ సమష్టిగా గానీ) మున్నగువాటి నుండి స్వేచ్ఛ వున్నపుడు మాత్రమే సహకారం వుండడానికి వీలుంది. (CoLii- 178)

## అంగీకరిస్తే ఇక అంతే!

అంగీకారంలో అంగీకరించే సత్తా ఒకటుంటుంది, ఉండదా? ఈ అంగీకారం కూడా స్వలాభ కృషి రూపం కాదా? కాబట్టి ద్వంద్వానికి సంబంధించిన ఘర్షణ సాగేటట్లు చేస్తాం. మళ్లీ అదే సమస్య. ఎందుకంటే మంద్రస్థాయి (మధ్యతరహా) మదినీ హృదినీ పోషించేది ఘర్షణే. ఘర్షణ మొత్తం అంతమైనపుడు మంద్రస్థితి నుండి విముక్తి పొందటం జరుగుతుంది. కాని అంగీకరించటమంటే కేవలం ఆశవదులుకోవటం- లేక మీకు ఆ పదం వేరే అర్థాన్నిస్తుందా? (CoLii-182)

## నేనుగురువును కాదు

దయ చేసి ఈవక్త చెప్పేది ఏదీ మీరు అంగీకరించ వద్దు. వక్త మీ గురువు కాదు, మీ ఉపాధ్యాయుడు కాదు, లేక అధికారీ కాదు. అతన్ని మీకు అధికారిగా చేశారంటే, మిమ్ములను మీరు నాశనం చేసు కుంటారు. ఈవక్తను కూడ నాశనం చేస్తారు. (BV)

## ఆత్మతృప్తికి, ఆధ్యాత్మికత అసహ్యం.

విజయాన్ని ఆరాధించే లోకంలో ఇలాంటి ఆత్మాభివృద్ధి గుర్తింపబడుతుంది. ప్రోత్సహించబడుతుంది. కాని నీవొక గురువు యొక్క శిష్యుడవని చెప్పడం, లేక నీవు అలా అనుకోవడం అనేక రకాల అసభ్యకరమైన దోపిడీలకు దారి తీస్తుంది. దురదృష్ట వశాత్తు దోపిడీ చేసేవాడు, దోపిడీ చేయించుకొనేవాడు, ఇద్దరూ తమ పరస్పర సంబంధంలో ఉత్తేజ భావం పొందుతారు. ఇలా లభించే ఆత్మతృప్తిని ఆధ్యాత్మిక అభివృద్ధి అనుకుంటారు. కాని అది పశుప్రాయమైంది అసహ్యాకరమైంది; ఇక ప్రత్యేకంగా గురు శిష్యుల మధ్య మధ్యవర్తులు వ్యవహార కర్తలు వుంటే ఏర్పడే ఆధ్యాత్మికత్వం అసహ్యంగా ఉంటుంది. గురువు వేరేదేశంలో వున్నపుడు, లేక అందుబాటులో లేనపుడు పొడసూపే ఆధ్యాత్మికత పశుప్రాయంగా వుంటుంది. అట్లే నీవు ముఖాముఖి భౌతిక సంబంధంలో లేనపుడు వుండే ఆధ్యాతికత అసహ్యంగా, పశుప్రాయంగా ఉంటుంది. ఇలా అందుబాటులో లేకపోవడం అంటే సరాసరి సంబంధం లేకపోవడం ఆత్మవంచనకు పిల్లతరహా భ్రమలకు ద్వారం తెరుస్తుంది. ఈ భ్రమలను తెలివిగలవారు, వైభవంవెంట అధికారం వెంట పడేవారు, దోచుకుంటారు. (CoLi-19)

## అణగిపోయివుండొద్దు

అణకువ వల్ల ఉన్నతునికి హీనునికి మధ్య విభాగం తెలియదు. గురు శిష్యుల మధ్య విభజన తెలియదు. గురువుకు శిష్యుడికి మధ్య విభజన ఉన్నంత వరకు అవగాహన సాధ్యం కాదు. సత్యాన్ని అవగాహన చేసికోవడంలో గురువు లేడు, శిష్యుడులేడు, ముందు కెళ్లిన వాడు, వెనుక బడ్డ వాడు లేడు. (COLi-19)

## గురువులో నమ్మకం వెచ్చగా వుంటుంది.

గురువులో నమ్మకమే గురువును సృష్టిస్తుంది. అనుభవం నమ్మకాన్ని బట్టి రూపు దిద్దుకొంటుంది. ఒక ప్రత్యేక క్రియా విధానంలో లేక ఒక ఆదర్శవాదంలో నమ్మకం కోరుకున్నదాన్ని లభింప జేస్తుంది- అయితే ఎంతటి వ్యయప్రయాసలతోనో! ఒక వ్యక్తికి అసమర్థత ఉంటే, నమ్మకం అతని చేతుల్లో శక్తివంతమైనదవుతుంది; అది తుపాకి కన్న ఎక్కువ ప్రమాదకరమైన ఆయుధం అవుతుంది. చాల మందికి నమ్మకం వాస్తవానికన్న చాల గొప్ప భావన గలది. 'ఉన్నదాన్ని' అర్థం చేసి కోడానికి నమ్మకం అక్కరలేదు. పైగా, తద్విరుద్ధంగా, నమ్మకం అవగాహనకు అవరోధం. అట్లే ఉద్దేశంగాని పక్షపాతం గాని అవగాహనకు నిశ్చితమైన అడ్డంకి. కాని మనంనమ్మకాలను, వాదాలను ఎన్నుకుంటాం. అవి మనకు వెచ్చదనాన్నిస్తాయి, వాగ్దానం చేస్తాయి, ప్రోత్సహిస్తాయి. నమ్మకాల విధానం తెలిస్తే వాటిని ఎందుకు అంటిపెట్టుకొని ఉంటామో గ్రహిస్తే ఒక ప్రధానమైన విరోధకారణం తొలిగి పోతుంది. (CoLi-73)

## లాభానికి, తప్పించుకోడానికి గురువు.

వ్యక్తి గతంగాగాని, ముఠాతరుపున గాని లాభం పొందాలనే కోరిక అజ్ఞానానికి, భ్రమకు, వినాశనానికి, విషాదానికి దారితీస్తుంది. ఈ కోరిక మీదు మిక్కిలి భౌతిక సుఖానికే గాక, అధికారం పట్లా ఉంటుంది; డబ్బుపైన, జ్ఞానంపైన, గుర్తింపుపైన అధికారం పొందాలని వుంటుంది. ఎక్కువకై తాపత్రయ పడడం ఘర్షణకు, విషాదానికి ప్రారంభం. ఈదుఃఖంనుండి ఆత్మవంచనకు సంబంధించిన ప్రతి రూపం ద్వారాను, అణచడం ద్వారాను, ప్రత్యామ్నాయం మరియు మహనీయత్వం లేక ఉత్కృష్టత్వం ద్వారాను తప్పించుకోటానికి ప్రయత్నిస్తాం. కాని తాపత్రయం కొనసాగుతూనే వుంటుంది, కాకపోతే మరోస్థాయిలో. ఏస్థాయిలో నైనా తాపత్రయ మనేది ఘర్షణ, బాధ. తప్పుకోడాలలో చాల సులభమైంది గురువు. కొందరు రాజకీయ సిద్ధాంతం ద్వారా వాటి కార్యక్రమాల ద్వారా తప్పుకుంటారు. కొందరు గురువు ద్వారా తప్పుకుంటారు. అపుడు తప్పుకునే మార్గం అతిముఖ్యమై పోతుంది. భయం మొండితనం, మార్గాన్ని కాపాడుతాయి. ఇక నీవు ఏమైనా ఫరవాలేదు; గురువే ముఖ్యమైన వాడౌతాడు. నీవు సేవకుడుగా-దానిఅర్థం

ఏమైనాగాని-లేక శిష్యుడు గా మాత్రమే ఉండిపోతావు. ఇందులో ఏదో ఒకటి కావడానికి నీవు చాలా చేయాలి; కొన్ని పద్ధతులకు కట్టుబడాలి, కొన్ని శ్రమలు సహించాలి. నీవు ఇవేకాదు, ఇంకా ఎక్కువైనవి చేయడానికి సిద్ధంగా ఉంటావు; ఎందుకంటే తాదాత్మ్యం సంతోషాన్ని, అధికారాన్ని ఇస్తుంది. గురువు పేరుతో సంతోషం అధికారం మర్యాద పూర్వకమైనాయి. నీవిక ఒంటరివి కావు, గడబిడ పడవు. జారిపోవు. నీవు అతనికి, ఆపార్టీకి, ఆసిద్ధాంతానికి లేక ఉద్దేశానికి చెందావు. నీవు సురక్షితమౌతావు. (COLi-73)

## గురువును సేవించాలి నమ్మాలి

గురువులను కనుగొన డానికి నీవు సేవచేయాలి, పని చేయాలి, త్యాగం చేయాలి, విధేయత చూపాలి, కొన్ని సుగుణాలు సాధన చేయాలి. సరే దాని కోసం నమ్మకం అవసరం (COLii-93)

## ఎవరో మనకు దారిచూపాలి?

అయ్యా, చూడండి, మనం అంధకారానికి, మార్గదర్శి కత్వానికి అలవాటు పడ్డాము. ఒకరిద్వారా దారి చూడాలని మనకుంటుంది; భద్రత, రక్షణ విజయం పొందాలనే కోర్కెల వల్ల ఎవరో ఒకరు మనకు మార్గం చూపాలని వుంటుంది. అది ఒక ఇచ్ఛ. ఆది మన అంతరాంతర వాంఛ; కాదా?

## భద్రతకొరకు, ఆదర్శంకొరకు గురువు

శాంతి అనేది ఒక మానసిక స్థితి. భద్రతలకు సంబంధించిన అన్ని కోర్కెల నుండి విముక్తి పొందడమే శాంతి. భద్రతను కోరే మనో హృదయం ఎల్లపుడూ భయం నీడలోనే ఉంటుంది. మన కోరిక భౌతిక భద్రత కొరకు మాత్రమే గాక, ఇంకా ఎక్కువగా ఆంతరంగిక, మానసిక భద్రత నిమిత్తం. ఈ కోరిక సుగుణం, నమ్మకం, ఒక దేశం (మున్నగువాటి) ద్వారా ఆంతరంగికంగా భద్రత పొందాలను కొంటుంది; అయితే ఆ దేశం పరిమితం, సంఘర్షణ తోకూడింది. అది ముఠాలను, ఉద్దేశాలను సృష్టింస్తుంది. భద్రంగా ఉండాలని, ఉన్నత సాధనంపొందాలని ఉన్న

కోరిక మార్గదర్శకత్వాన్నిపోషిస్తుంది; ఆదర్శాన్ని అనుసరించమంటుంది; విజయారింధనకు ఇష్టపడుతుంది; అంతేకాగా నాయకుల, రక్షకుల, గురువుల, మహాగురువుల అధికారాన్ని పోషిస్తుంది. దీన్నంతా ప్రయోజనకర ప్రబోధం అంటున్నాము. కాని నిజంగా ఇది అనాలోచిత అనుకరణం. (COLii-186)

## తెలిసిన గురువు-తెలియని శిష్యుడు : ఇది ఆధ్యాత్మికమా ?

బోధించేటప్పుడు అధ్యాపకుడు అంటే తెలిసిన గురువు ఉంటాడు, అలాగే తెలియని శిష్యుడూ వుంటాడు. ఆవిధంగా ఎప్పటికీ వారిద్దరి మధ్య విభజన పోషిస్తాము. ఇది ప్రధానంగా సాధికారికమైన వారసత్వపు దృష్టి; దాంట్లో ప్రేమ వుండదు. ఉపాధ్యాయుడు ప్రేమ గూర్చి మాట్లాడ వచ్చు, శిష్యుడు తన భక్తిని నొక్కి చెప్పుకోవచ్చు; వాళ్ల సంబంధం అనాధ్యాత్మికం, లోతైన అవినీతిదాయకం, గొప్ప గందర గోళానికి బాధకు దారితీస్తుంది. ఇది స్పష్టం, ఔనా?!

## నేర్చుకొనే స్వేచ్ఛ, లేక మార్గదర్శకత్వం

మనం నిరంతరం నేర్చుకుంటున్నపుడు, ఎవరో ఒకరి నుండి కాకుండ, మనకు తటస్థించే ప్రతిదాని నుండి నేర్చుకుంటున్నపుడు మార్గదర్శకత్వంతో ఏమైనా అవసరం వుందా? క్షేమంగా, భద్రంగా, సుఖంగా ఉండాలను కున్నపుడు మాత్రమే మనం తప్పని సరిగా మార్గ దర్శకత్వం కోరతాము. నేర్చుకోవడంలో స్వేచ్ఛవుంటే మనం రాలే ఆకు నుంచి, ప్రతి తరహా సంబంధం నుంచి, మన మనోక్రియాకలాపాల ఎరుక నుంచి నేర్చుకుంటాం. కాని మనలో ఎక్కువ మందికి నేర్చుకొనే స్వేచ్ఛలేదు. ఎందుకంటే మనం బోధింపబడడానికి ఎంతగానో తయారయ్యాం. గ్రంథాలు తల్లిదండ్రులు, సంఘం, మనం ఎలా ఆలోచించాలో చెపుతున్నాయి. గ్రామఫోను రికార్డు లాగా మనం వున్నదాన్ని పునశ్చరణచేస్తుంటాము. (COLii-245)

## విశ్వాసి సౌఖ్యమాశించి సహనంచూపడం.

మానవులు ప్రచారానికి నిబద్ధితమైనారు; వాళ్లు పెరిగిన సమాజం వల్ల నిబద్ధింపబడ్డారు; అందులో ప్రతి మతం తన మార్గమే ఉత్తమోత్తమమైందని నొక్కి

చెపుతుంది. ఇక పోతే వేలాది గురువులున్నారు. వాళ్ల పద్ధతి, వాళ్ల విధానం, వాళ్ల ధ్యానమార్గం మాత్రమే సత్యానికి దారి తీసే ఏకైకమార్గమని భావిస్తారు, అలాపోషిస్తారు. గమనిస్తే ఒక విషయం తెలుస్తుంది. ప్రతి శిష్యుడూ ఇతర గురువుల శిష్యులను నమ్రతగా సహిస్తాడు. పరిశీలిస్తే ఇది గమనిస్తాం. సహనమనేది రాజకీయంగా, మతపరంగా, సామాజికంగా మనుష్యులమధ్య గల విభజన యొక్క నాగరీకమైన అంగీకారం. ప్రతి విశ్వాసికి సౌఖ్యానిస్తూ మానవుడు అనేక మార్గాలు కనిపెట్టాడు. కాబట్టి ప్రపంచం ముక్కచెక్కలైపోయి ఉంది. (TOR-38)

## తెలుసునన్న వానికి తెలియదు

ఉపాధ్యాయుని పని ఏమిటి? వైద్యశాస్త్రమో, విజ్ఞానశాస్త్రమో, ఒక కంప్యూటర్ మీద పనిచేయడమో, అలాంటివి తెలిసి ఉంటే, అతనివిధి ఏమిటంటే తనకున్న విజ్ఞానాన్ని, సమాచారాన్ని ఇతరులకు బోధించడం. ఇది సువిదితం. కాని నాకు తెలుసు, శిష్యునికి తెలియదు, కాబట్టి ప్రబోధం చేయాలనే' ఉపాధ్యాయుడు (లేకగురువు) గురించి మాట్లాడ వలసివస్తే, శంకించాల్సి వుంటుంది. ఎందు కంటే నాకుతెలుసు అనేవాడికి తెలియదు. సత్యంగాని, జ్ఞానోదయ సౌందర్యంగాని, ఏ పేరు పెట్టినాసరే ఎన్నటికీ వర్ణించవీలులేదు-అది ఉంది. అది చైతన్యవంతమైంది, చలనాత్మకమైంది, సజీవమైంది భారరహితమైంది నిర్జీవమైన దాన్ని గూర్చి స్పష్టంగా చెప్పొచ్చు. మీకు చచ్చిన వాటిని గూర్చి చెప్పే ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడే కాదు. (BV-58)

## గందరగోళం తొలగడానికి గురువు

సుఖంగా ఉన్నపుడు, నీకది తెలియదు. సుఖంలేనపుడే దాన్నిగురించి వెతుకు తావు. నీవు సుఖంగా ఉన్నావని తెలిసిన క్షణంలో ఆక్షణంలో సుఖం అంతమైపోతుంది. నీకు గందరగోళం తొలగాలని ఆత్మనిమిత్తం చూపినపుడు- అది సర్వోత్తమ మనస్సు కావచ్చు, మహా గురువుకావచ్చు, లేక ఏ పేరు పెట్టినా సరే నీవు గందర గోళంలోనే పని చేస్తున్నావు. నిబద్ధిత మనసునుండి వెలువడిందే నీ చర్య, అవును కదా? (COLiii-179)

## ప్రతి విద్యార్థినీ ప్రత్యేకంగా.....

ప్రతివిద్యార్థినీ ప్రత్యేకవ్యక్తిగా చూసి, ఎవరితోనూ పోల్చకుండా ఉన్నపుడు ఉపాధ్యాయునికి నిజంగా ఏ విధానంతోనూ, ఏ పద్ధతితోనూ పనిలేదు. బయటాలోపలా ఏయే ప్రభావాలు పనిచేసి, తనను నిబద్ధిస్తున్నాయో తెలుసు కోడానికి వీలుగా విద్యార్థికి 'సాయపడడమే' ఉపాధ్యాయుని ముఖ్య కర్తవ్యం. తద్వారా విద్యార్థి జీవించడమనే క్లిష్టసమస్యను తెలివిగా, నిర్భయంగా ఎదుర్కోగలడు. అంతే గాని ఉన్న అయోమయ స్థితికి, ఉపాధ్యాయుడు మరికొన్ని సమస్యలు కలపడానికి కాదు. (COLii-138)

ఇది ఉపాధ్యాయుని నుండి అత్యధికంగా ఆశించడంకాదా అనిప్రశ్నించారు. దీనికి అసమర్థులైతే టీచరుగా వుండడందేనికు? బోధించడం కేవలం (జీవనభృతికి) ఒకవృత్తి, ఒక ఉద్యోగం అనుకుంటే ఆప్రశ్నల్లో అర్థముంది. కాని నిజమైన విద్యావంతునికది అసాధ్యం ఏమీకాదని నేను భావిస్తున్నా. (COLii-139)

## గుర్తింపు

## తాదాత్మ్యం చెందడమెందుకు !

ఒకరితోగాని, ఒక మతాతో గాని. ఒకదేశంతో గాని ఎందుకు తాదాత్మ్య మౌతావు? క్రైస్తవుడు, హిందువు, బౌద్ధుడు అని ఎందుకు పిలుచుకుంటావు? లెక్కలేనిశాఖలున్నా, ఏదోశాఖకు ఎందుకు చెందుతావు? సంప్రదాయం, అలవాటు, ప్రేరణ, పక్షపాతం, అనుకరణ లేక స్తబ్దత వలన మతపరంగా, రాజకీయంగా ఏదో గ్రూపుతో గుర్తింపుజెందుతుంటారు. గుర్తింపు సృజనాత్మక అవగాహనను అంతం చేస్తుంది. అపుడు పార్టీఅధికారి, మతాధికారి, లేక అభిమాననాయకుడి చేతిలో కేవలం పనిముట్టైపోతావు.(COLi -11)

## తాదాత్మ్యం ప్రేమకాదు.

ఒకరితో తదాత్మ్యం చెందడం ప్రేమకు గుర్తా? తాదాత్మ్యంలో ప్రయోజన భావన వుందా? తాదాత్మ్యం చెందడంతో ప్రేమ లేకపోవడంలేదా. ప్రయోగం లేకపోవటం కాదా? ఒకదానికి చెందిపోవడమంటే స్వామ్యం చెందడం, సొంతంగా

ఏదో నిలుపుకోవడం. సొంతం అనేది ప్రేమను కాదంటుంది, కాదా? సొంతం చేసికోవడమంటే భద్రంగా వుండడం. సొంతం అనేది స్వరక్షణ (Defence) తన్నుతాను కాపాడుకోవడం, మెదువుకాకుండ పోవడం. మరొకరికి చెందడంలో సూక్ష్మంగాకాని, స్థూలంగాగాని నిరోధం వుంది. ప్రేమనేది ఆత్మరక్షణతో కూడిన నిరోధ రూపమా? కాపాడుకోవడం(defence) వుంటే అదిప్రేమా?

## గుర్తింపు స్వేచ్ఛకువిచ్ఛిత్తి

ప్రేమమెదువైంది, pliable వంగేది, గ్రహించేది, స్పందన యొక్క అత్యుత్తమ రూపం. ఒకరికి చెందడమూ, ప్రేమా కలిసి వుండవు. గుర్తింపు ప్రేమను పాడుచేస్తుంది. చెందడ మనేది ఆలోచనా ప్రక్రియ. దాన్ని మనసు కాపాడుతుంది. పెద్దది చేస్తుంది. ఏదోకావడంలో మనసు నిరోధిస్తూనే, కాపాడుతుంది; అది సొంతం చేసుకోవాలి, నెట్టివేయాలి (discard) అనీ చూస్తుంది. ఈ కావడంలో మనసులేక ఆత్మ కఠినమౌతుంది, సామర్థ్యం చెందుతుంది. ఇది ప్రేమకాదు. గుర్తింపుచెందడం స్వేచ్ఛను విచ్ఛిన్నం చేస్తుంది. స్వేచ్ఛలోమాత్రమే అత్యుత్తమ స్పందన వుంది.

## గుర్తింపు పరిశోధనకు అడ్డం

ప్రయోగం చేయడానికి గుర్తింపు చెందడముండాలా! గుర్తింపు చెందే క్రియే పరిశోధనను; లేక కనిపెట్టడాన్ని నిలిపేస్తుంది కదా! ప్రయోగం, తనతాను కనిపెట్టడం అనేది లేకపోతే సత్యం ఇచ్చే సౌఖ్యం వుండదు. గుర్తింపు కనిపెట్టడాన్ని అరికట్టుతుంది. అది మరోరకపు సోంబేరితనం. గుర్తింపు అనేది తనకు బదులుగా మరొకరి (Vicarious) అనుభవం. కాబట్టి అది పూర్తిగా అసత్యం.

## గుర్తింపు అనుభూతికాదు, శరణు.

అనుభూతితో గుర్తింపులన్నీ ఆగిపోవాలి. ప్రయోగానికి భయముండరాదు. భయం అనుభవాన్ని అరికట్టుతుంది. భయం గుర్తింపు కల్గిస్తుంది - ఒకరితో, ఒక కూటమితో ఒక ఆదర్శవాదంతో, అలా కలిసిపోవాలను కొంటుంది. భయం

# జీవితం - తర్కం

మనిషిది మారే స్వభావం. పశువుది మారని స్వభావం. రెండు కాళ్ల జీవి మానవుడు. భౌతికావసరాలకు పరిమితమైన వరకు పశువు మనిషి ఒకటే. భౌతికావసరాలు మనుషులందరికీ ఒక్కటే. మనసు చేరి మనిషిని మనిషిని విడదీస్తుంది. మనిషిని జంతువును వేరు చేస్తుంది. ప్రాణులన్నిటికన్న మానవుడు ఉన్నతుడని చెప్తుంది. 'అహం' సృష్టిస్తుంది. హీనంగా ప్రవర్తిస్తున్నాడు. అబద్ధాలాడే వాడిని 'గాడిద కొడకా' అంటే 'వీడా నాకొడుకు?' అని గాడిద భాధపడుతుందట. కాబట్టి గాడిదకన్న ఆ మనిషిలో గొప్పదనమేముందీ?

భౌతిక అవసరాలు తీర్చుకొంటూ, మానసిక తృప్తులకై మనసు ఆరాటం పడకుండా ఉంటే, అప్పుడు మనిషి శాంతిగా జీవించవచ్చు. కాని మనసు లేకుండా పశువులా జీవించడమేనా? అని అడుగుతారేమో! జీవిస్తే మాత్రమేం? అనేది తేలికైన సమాధానమే కాని మరొక్కమాట కూడ అనుకొందాం. తాను హాయిగా నున్నట్లుగాని అశాంతిగా నున్నట్లు గాని పశువుకు తెలుసా? అయినా నీకులా చెప్ప లేదు. మనిషికి తన సుఖం, తన దుఖం, తన స్థితి చక్కగా తెలుసు. మార్పు కోరుకోవడం కూడ అతనికి తెలుసు. పశువుకు అలా తెలియదు. మార్గం తెలుసు. అదే పశువుకి - మనిషికీ తేడా?

మనిషంటే శరీరం మనసు కూడి ఉండడమేకాదు. చుట్టూ ఉన్న పరిసరాలతో. వస్తువులతో, మనషులతో ఉన్న సంబంధంకూడ. అంతే కాదు, తన మనసులో ఉన్న విశ్వాసాలు, సిద్ధాంతాలు, రాగద్వేషాలు మొదలగు వాటన్నిటితో ఉన్న సంబంధం. కనుక సంబంధంలోనే మనిషి ఉన్నాడు. సంబంధాలనుబట్టి అతని జీవితం ఏమిటో నిర్ణయిమౌతుంది. ఈ సంబంధాలలో అతి సన్నిహితమైనది భార్యా భర్తల సంబంధం. ఒక మనిషి నిజంగా ఎలాంటివాడో అతని భార్య చెప్పగలదు. అలాగే భార్యగురించి భర్త చెప్పగలడు. అదైనా కొంత వరకు మాత్రమే.

## జీవించడ మంటే సంబంధంలో వికసించడం

మనిషి గడిపే జీవితాన్నిబట్టి అతడేమిటో తెలుస్తుంది. అతనిగుణ శీలాలు స్వభావవర్తనాలు వెల్లడౌతాయి. అవన్నీ సంబంధాన్ని బట్టి వెలికి వస్తుంటాయి.

# జీవితం - తర్కం

మనిషిది మారే స్వభావం. పశువుది మారని స్వభావం. రెండు కాళ్ల జీవి మానవుడు. భౌతికావసరాలకు పరిమితమైన వరకు పశువు మనిషి ఒకటే. భౌతికావసరాలు మనుషులందరికీ ఒక్కటే. మనసు చేరి మనిషిని మనిషిని విడదీస్తుంది. మనిషిని జంతువును వేరు చేస్తుంది. ప్రాణులన్నిటికన్న మానవుడు ఉన్నతుడని చెప్తుంది. 'అహం' సృష్టిస్తుంది. హీనంగా ప్రవర్తిస్తున్నాడు. అబద్ధాలాడే వాడిని 'గాడిద కొడకా' అంటే 'వీడా నాకొడుకు?' అని గాడిద బాధపడుతుందట. కాబట్టి గాడిదకన్న ఆ మనిషిలో గొప్పదనమేముందీ?

భౌతిక అవసరాలు తీర్చుకొంటూ, మానసిక తృప్తులకై మనసు ఆరాటం పడకుండా ఉంటే, అప్పుడు మనిషి శాంతిగా జీవించవచ్చు. కాని మనసు లేకుండా పశువులా జీవించడమేనా? అని అడుగుతారేమో! జీవిస్తే మాత్రమేం? అనేది తేలికైన సమాధానమే కాని మరొక్కమాట కూడ అనుకొందాం. తాను హాయిగా నున్నట్లుగాని అశాంతిగా నున్నట్లు గాని పశువుకు తెలుసా? అయినా నీకులా చెప్ప లేదు. మనిషికి తన సుఖం, తన దుఖం, తన స్థితి చక్కగా తెలుసు. మార్పు కొరుకోవడం కూడ అతనికి తెలుసు. పశువుకు అలా తెలియదు. మార్గం తెలుసు. అదే పశువుకి - మనిషికీ తేడా?

మనిషంటే శరీరం మనసు కూడి ఉండడమేకాదు. చుట్టూ ఉన్న పరిసరాలతో. వస్తువులతో, మనషులతో ఉన్న సంబంధంకూడ. అంతే కాదు, తన మనసులో ఉన్న విశ్వాసాలు, సిద్ధాంతాలు, రాగద్వేషాలు మొదలగు వాటన్నిటితో ఉన్న సంబంధం. కనుక సంబంధంలోనే మనిషి ఉన్నాడు. సంబంధాలనుబట్టి అతని జీవితం ఏమిటో నిర్ణయిమౌతుంది. ఈ సంబంధాలలో అతి సన్నిహితమైనది భార్యా భర్తల సంబంధం. ఒక మనిషి నిజంగా ఎలాంటివాడో అతని భార్య చెప్పగలదు. అలాగే భార్యగురించి భర్త చెప్పగలడు. అదైనా కొంత వరకు మాత్రమే.

## జీవించడ మంటే సంబంధంలో వికసించడం

మనిషి గడిపే జీవితాన్నిబట్టి అతడేమిటో తెలుస్తుంది. అతనిగుణ శీలాలు స్వభావవర్తనాలు వెల్లడౌతాయి. అవన్నీ సంబంధాన్ని బట్టి వెలికి వస్తుంటాయి.

కనుక 'మనిషి' అనినా జీవితం అనినా మనుషులమధ్యనుండే సంబంధమే. పుట్టిన వాడు బ్రతకటం కోసమే. అయితే తెలివి కలవారు వికాసవంతంగా ప్రఫుల్లంగా జీవించే అవకాశం వుంది. ఆ వికాసం మనస్సు స్థితిని బట్టి సామాజిక పరిస్థితిని బట్టి వుంటుంది. ఈస్థితిగతులు సంబంధాన్ని బట్టి వుంటాయి.

మానవునికి జీవనమే ప్రధానం. జీవం అంటే ప్రాణం. జీవం కలవాడు జీవుడు. జీవుని బ్రతుకు తెరువు జీవనం. మానవుని కర్మ, చర్య, క్రియ, ప్రతిక్రియ, భావం, బ్రతుకు, ఉనికి మొత్తం కలిసి జీవనమవుతుంది. జీవనం, జీవితం ఇంచుమించు ఒకే భావంలో వాడుతుంటారు. జీవితం అనే పదంలో 'త' ప్రత్యయం 'బడిన' అనే అర్థం వల్ల జీవితమంటే జీవించబడినది అని అర్థం వస్తున్నది. జీవితం గడిచిపోయిన దాన్ని సూచిస్తుంది. నడుస్తున్నది అనగా వర్తమానంలో ఉన్నది జీవనమని భావించ వలసి ఉంటుంది. దానినే జీవిస్తున్నామని చెప్పుకుంటున్నాం. జీవితం లేక జీవించడం అనేది ఒకధార. క్షణక్షణం గమనంలో ఉంటుంది. ఆ గమనాన్ని, వర్తమానంలో, మెళకువగా గమనించ గలగాలి. దానికై నిత్య జాగృతి వహించాలి. అపుడు జీవితం ఎరుక అవుతుంది, జీవించడం జరుగుతుంది.

జీవించడం ఒకకళ. అది కళలకు మించిన కళ. ఎల్లకళలకు పుట్టినిల్లు. నేర్చుకోవడం ద్వారా జీవితాన్ని గ్రహించడం జరుగుతుంది. తనకు తాను, తనను తాను అధ్యయనం చేసికోవడం, చదువు కోవడం, తెలిసికోవడం ముఖ్యం. ఇది "నేనెవరు" అనే ప్రశ్న కాదు, "ఆ నేను బ్రహ్మను" అనే సమాధానముకాదు. అలా సమాధాన పడడం నేలవిడిచి సాము చేయడం లాంటిది.

అసలు మనం స్వతంత్రంగా బ్రతుకుచున్నామా? ప్రతి కదలిక తెలిసి చేస్తున్నామా? లేక అలవాటుగా అనుకరిస్తున్నామా? లోతుగా పరిశీలించాలి. జీవితం అనుకరణ కాదు, అధికారమూకాదు. స్వేచ్ఛవుంటేనే అసలు జీవితం. మన మనసులో వున్న సరుకేమిటి? ఏఏ విశ్వాసాలు చోటు చేసుకున్నాయి, ఏఏప్రేరణలు పని చేస్తున్నాయి, ఏఏకాంక్షలు ప్రకోపిస్తున్నాయి, ఏఏ ధ్యేయాలు ముందు నడుస్తున్నాయి? మనసులోని నిల్వ సరుకు వల్ల ఎలాంటి సంబంధాలేర్పడు తున్నాయి? ఈ మొత్తం కలిసిన "నేను"నూ, మనసుతో కూడిన నేనునూ సాంతం తెలిసికోవడమేతన్ను

తాను తెలిసి కోవడం; నిజ స్వరూపం తెలిశాకనే నిజమైన జీవితం మొదలవుతుంది.

తిన తిండి, కట్ట బట్ట, నిలువనీడ అందరికీ కావాలి. అది సమంగా దొరక్క పోవడం వల్ల జీవితంలో సమస్యలు చెలరేగుతున్నాయి. ఈ సమస్యలకు కారణం లేమి తనమూ, పని లేని తనమూ. పరస్పర సహకారంతో ఇవి తీరడం సాధ్యం; కష్టసాధ్యం ఎందుకంటే ఆహారాదులను కేవలం భౌతిక అవసరాలకు గాక, మానసికతృప్తికి వినియోగించుకొంటున్నారు. అందుకని, ఇంకా ఇంకా కావాలని కూడ బెట్టుకోవడం జరుగుతుంది. సమస్యలకు ఇదే కారణం. సమస్యలు ఘర్షణకు కారణం. ఘర్షణ వల్ల జీవితం ముక్క చెక్కలై పోతున్నది.

జీవితమంటే హాయి కాదు. కాలుమీద కాలువేసికొని కూర్చుంటే హాయిరాదు. కాలు కదపకుండా తినడం, కేవలం డబ్బు సంపాదించడం జీవితం కాదు. అనుకున్నట్లుగా జీవన శకటం నడవదు. అసలు అనుకోవడంలోనే లోపముందని తెలియాలి. సుఖాలనబడేవి, కష్టాలనబడేవి రావడం గాలి వీచి నంత సహజం. ఒకటి కావాలనీ, రెండోది వద్దనీ అనుకోరాదు. అవి తొలగవు. వచ్చినవి వచ్చినట్లు తీసుకోవాలి. అందుకు కష్ట సుఖాల స్వభావం తెలిసికోవాలి. కష్ట సుఖాలను వేరు చేయకుండా, వాటి నుండి తప్పించుకోకుండా రెంటినీ స్వీకరిస్తే. వాటి తాకిడి తగలదు. అలా ఉండగలగడంలో ఉంది గొప్ప కళ.

మెలకువగా జీవించ కల్గించేదే జీవితం. ఏదో తొందరపాటుగానో లేక మందగొడిగానో కాలంగడపడం జీవితానికి అనర్థం. ఎల్ల వేళలా జాగ్రత వహించాలంటే మెలకువకావాలి. మెలకువ కావాలంటే శ్రద్ధ, లోదృష్టి అవసరం. అపుడు జీవితం అర్థవంతమౌతుంది.

పులుముకున్న రంగులన్నీ జీవించడానికి అడ్డం. రంగు, మసి, మలినం అంతా ఒకటే; జీవితపుటద్దాన్ని కప్పి వేస్తాయి. రంగులు వాస్తవం కాదు. అభిప్రాయాలు, నమ్మకాలు అనేవి రంగులు; రంగులు నానా రకాలు; అవి కులం పేరుతో, మతం పేరుతో, దేవుళ్ళ పేరుతో, జాతి పేరుతో మనసును చెదరగొట్టు చున్నాయి. అవి తొలిగితే గాని స్వచ్ఛ మైన జీవితం తొంగి చూడదు.

"ఏ ప్రయోజనంలేనిదే జీవితం మెందుకు? ధ్యేయం లేని జీవితం కూడా జీవిత మేనా?" అని అంటారు. పుట్టినవాడు జీవించాలి. జీవించడానికే జీవితం. జీవించడమే దాని ప్రయోజనం. జీవించడమంటే నిశ్చింతగా గడపడం, ప్రేమతో వికసించడం. అలాంటి జీవితం సహజమైంది, చైతన్యవంతమైంది. కాబట్టి ధ్యేయమూ విధానమూ ప్రయోజనం అంతా ప్రేమే. ప్రేమయే జీవితం. అదే పరమార్థం.

జీవితంలో హేతువు సహజమైంది. ఎందుకంటే మానవునికి మనసుంది. అది ప్రశ్నిస్తుంది. తర్కిస్తుంది. కారణంచూస్తుంది. అది దానిగుణం. ఆ గుణంతో బద్ధమైంది కాబట్టి మనసును బుద్ధి అన్నారు. బుద్ధి కలవాడే మానవుడు. బుద్ధి తర్కబద్ధమైంది. తర్కం బౌద్ధికమైంది, నిబద్ధమైంది, స్వతస్సిద్ధమైంది. స్వేచ్ఛకు దోహదమైంది తర్కం. హేతువు ననుసరించి యోచించడం లేక హేతువు ఆధారంగా వాదించడం తర్కం. అయితే బుద్ధిపరాధీనమైనపుడు తర్కం లోపిస్తుంది. వెంటనే మౌఢ్యం ప్రవేశిస్తుంది. బానిసత్వం దానివెంట పడుతుంది. నిజమైన జీవితం మృగ్యమై పోతుంది. అంతేకాదు మృగప్రాయమవుతుంది.

హేతువు జీవితంలో ఒక భాగం. హేతు వంటే కారణం. కారణం వల్ల కార్యం జరుగుతుంది. హేతువు సహజాతమైంది. స్వచ్ఛమైన మనసులో హేతువు క్షణ క్షణం కార్య రూపందాల్చుతుంది. అది ఎప్పటికప్పుడు జరిగే పని. అది వేరైన ప్రక్రియకాదు. తర్క మంటే ఆలోచన, విచారణ. వాద ప్రతిపాదనలు ప్రధానంకావు. అయితే హేతువుమీద హేతువు చూపుతారు. అవుననడంగాని కాదనడం గాని జరుగుతుంది. అది వాదులాటకు దారితీస్తుంది. కేవలం తర్కించుకుంటూ కూర్చోవడం కాలయాపన. ఇది కూడ బుద్ధి చేసే పనే, స్వాభావికం. తర్కం ప్రస్తుతంలో జరిగితే క్రియాశీలకం అవుతుంది. గత స్మరణతో జరిగితే ప్రతి క్రియ అవుతుంది.

తర్కమంటే వస్తు తత్వాన్ని తెలిపే పరిజ్ఞానం. స్పష్టతకు దారితీసే విశ్లేషణ. తెలిసుకున్న తర్వాత ప్రయోగించేది. అంటే ఆర్జించిన జ్ఞానంతో వాదించడం. గడించింది పరిమితం. ఇంకాగడించ వలసింది ఉన్నంతకాలం అది పరిమితమే. అంచేత గడించిన దాన్ని ప్రయోగించే ప్రక్రియకూడా పరిమితమే. కాబట్టి

తర్కానికున్న పరిమితి గమనించతగ్గది.

తర్కంలో శబ్దం పై తరచడం జరుగుతుంది. శబ్దం వస్తు సూచక మైందే కాని వస్తువు కాదు. ఇది కూడ గమనించదగ్గ పరిమితి. శబ్దానికి పూర్వం ఒక అభిప్రాయం ఉండి ఉంటుంది. అది మార్పు చెందుతూ ఉంటుంది. ఇప్పటి అభిప్రాయం గ్రహించాలి. సరియైన అర్థాన్ని నిర్ధారణ చేసికోవాలి. దాని వ్యుత్పత్తి తెలియాలి. కాబట్టి అవగాహన నిమిత్తం ఎప్పటి నుండో ఇప్పటి వరకు ప్రయాణం చేయాలి. అది ఆలోచనా గమనం. ఈ పరిశ్లేషణ పరిమిత బుద్ధికి లోబడి వుంటుంది. పలానా అర్థం చేకూరాలని పూర్వ నిర్ణయంతో తరించినా కూడ పరిమిత ప్రయోజనమే వుంటుంది. ఇలాంటి కట్టుబాట్లు, పరిమితులున్న చోట సంపూర్ణ అవగాహనరాదు.

తర్కమని, వితర్కమని, సుతర్కమని, ఉన్నాయి. కుతర్కంకూడ జరుగుతుంటుంది. శాస్త్రంలో విభిన్నతర్కాలు, ఆధారాలు ఉన్నాయి. అన్నీ తర్కాలే. అంటే ఉద్దేశాన్ని బట్టి వాదమూవుంది, వితండవాదమూ వుంది. వాదనాపటి మనుబట్టి తీర్మాన మేర్పడుతుంది. శబ్దంపై ఉన్న అదుపు, అవగాహన, వ్యాపకతను బట్టి, జ్ఞానసంచయాన్ని బట్టి, ఎదుటి వాదనలో బలహీనతను బట్టి ప్రతివాదన నెగ్గుతుంది. న్యాయవాదులు చేసే పని అదే కదా! కానివాస్తవం రెండు రకాలుగా బహుముఖాలుగా ఉండదుకదా! అంచేత వాదం విభజనాత్మకం. విభజనపాక్షిక అర్థాన్నిస్తుంది. పాక్షికత్వం ఒక పరిమితి.

వాదవివాదాలకు పనికి వచ్చేది సునిశితమైన బుద్ధి. అందులో హృదయం పాలు తక్కువ. ప్రేమ లుప్తము. ప్రయోజనమే ప్రధానం. లబ్దిలో స్వార్థం ఇమిడి వుంటుంది. కావలసింది అవగాహన. అంటే తక్షణ క్రియాశీలత. ఆర్ద్రతలేని వాదన వాస్తవదూరం.

తర్కం జీవితంలో ఒక భాగం. కాని తర్కమే జీవితం కాదు. జీవితంలో కలిసిపోయి, ఎప్పటికప్పుడు జీవిత అవగాహనకు ఉపకరించేది హేతువు. జీవిత నీడలో జీవితమంటే ఏమిటో తెలిసికోవడానికి పోరాటం చేసేది తర్కం. సామాన్యంగా

హేతువూ, తర్కమూ ఒకటే. ప్రక్రియాభేదం లో కొద్దితేదా కనిపిస్తుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే గాని తెలియదు. హేతువు నిశ్శబ్దంగా దారి చూపిస్తుంది. తర్కం శబ్దం పరంగా వివరణ విస్తుంది. జీవన అవగాహనకు తోడ్పడే తర్కం కొంత ముఖ్యమైంది. తర్కాన్ని న్యాయశాస్త్రమని కూడా అంటారు.

తర్కం మనిషికి కన్నులాంటిది. తర్కంలేని మనిషి గ్రుడ్డి వానితో సమానం. కాని గ్రుడ్డివాడుకూడా జీవిస్తాడు అనేది గుర్తించాలి. కళ్ళున్నజీవితం మెలా ఉంటుందో కళ్ళు లేని జీవితం ఎలా ఉంటుందో తెల్పేది తర్కం. ఏదో ఒక రూపంలో జీవితానికి తర్కానికి అవినాభావ సంబంధం వుంది. తర్కం యొక్క సహాయం జీవితవికాసానికి చాలా అవసరం.

కావలసింది హేతు జీవనం. హేతువాదం కాదు. జరిగిందాన్ని, జరగబోయేదాన్ని హేతుబద్ధంచేయవచ్చు. అది సిద్ధాంతీకరించడ మేగాని జీవించడం కాదు. జీవించడంలో బాధ్యత, సానుభూతి, సహకారం, అనురాగం, అవిభజన అవిభేదం ఉంటాయి. అవి మానవతా లక్షణాలు. మానవతకు తర్కం ఎంతవరకు ఉపకరిస్తే అంతవరకే దాని సార్థకత.

కేవలం తర్కం ద్వారా జీవితానికి పూర్తివిడుదల కలుగుతుందా! స్వేచ్ఛలభిస్తుందా? లభించదు. ఇకపోతే, సంపూర్ణ స్వేచ్ఛను మోక్షమనుకొన్నాము! అదిదైవపరమైందని భావిస్తే అది తెలియని స్థితి. ఏదో తెలియని మోక్షం కొరకు తెలిసిందాంతో జీవించడం కుదరదు. జీవితంలో హేతువు అనుక్షణం వివేకం కలిగించాలి. మానసిక బంధాలు వదలాలి. కొత్తవి తగిలించుకోకూడదు. వాస్తవికంగా, స్థిమితంగా, సరళంగా జీవిస్తూఉండాలి. జీవించడంలో ఎప్పటికప్పుడు చైతన్యం పని చేయాలి. గతమూ భూతమూ స్పృశించని ఎరుకలోనే సహజమైన స్వేచ్ఛ సిద్ధించే అవకాశముంటుంది.

హేతువు మనిషిని ఈ విధంగానో ఆ విధంగానో ప్రవర్తింపజేస్తుంది. కలిపిన కారణమే విడదీస్తుంది. పని చేయటానికి కారణమే ప్రధానమైతే, మనస్సు ఎన్నడు స్వేచ్ఛగా వుండదు. ఎంత సూక్ష్మంగా ఎంత తార్కికంగా ఉన్నా హేతువు ఆలోచనా

ప్రక్రియ మాత్రమే. ఆలోచన ప్రభావితమై ఎప్పుడూ వ్యక్తి ఇష్టానుసారంగా కోర్కె ద్వారా, అభిప్రాయం ద్వారా, నిర్ణయం ద్వారా నిబద్ధమై వుంటుంది. అది ఇతరుల వత్తిడిని బట్టి వచ్చింది కావచ్చు సొంతంగా ప్రవేశితమైనదీ కావచ్చు.

--జె.శ్రీ.

## కృష్ణజీ :

### ఏర్పాటు - ఏకాంతం

ఎవరైనా పూర్తిగా ఏకాంతంగా ఉండాలిగాని, వేరైపో కూడదు. వేరైపోవడానికి ఏకాంతంగా ఉండడానికీ చాలా వ్యత్యాసం వుంది. ఏకాంతంగా ఉండడం అంటే సమగ్రంగా ఉండడం వేరై పోవడంలో సంబంధం తెలిగిపోతుంది. నిత్య జీవితంలో, కార్యకలాపంలో తెలిసో తెలియకో, గాయం తగలకూడదు. అనే ఉద్దేశంతో చుట్టూ గోడ కట్టుకుంటారు. దాంతో ప్రతి సంబంధానికి ఆటంకం ఏర్పడుతుంది. అది ఒక రకమైన మనస్తత్వం. ఏకాంతంగా ఉండే మనస్తత్వం మానసికంగా ఏవరి మీదా ఆధారపడదు. ఎవరికీ బంధింపబడివుండదు. అంటే ప్రేమలేదని కాదు. ప్రేమంటే బంధం కాదు. భయం, ఘర్షణ, భావన లేకుండా లోతుగా, అంతర్ముఖంగా ఉండే మనస్తత్వాన్ని కలిగించేది ఏకాంతం. (TAI-93)

### విధేయతలో స్వేచ్ఛలేదు.

ఇతరులు వాగ్దానం చేసే ఊహాత్మక ఫలానికీ, లేక నిర్వాణానికీ, లేక మోక్షానికీ, లేక ఎప్పుడో పొందే సత్యానికీ, వాళ్ళు చెప్పింది చేయడానికీ లోబడ్డానంటే యాంత్రికమై పోతాను. లోబడడం సమ్మతించడం, విధేయత చూపడం- అన్నీ ఒకే అర్థంలో విధేయత అంటారు. ఇంగ్లీషులో దాని మూలార్థం ఏమిటంటే వినడం, శ్రవణం చేయడం ఇతరులు చెప్పింది సతతం శ్రవణం చేయడం వల్ల నేను కూడా ఇతరుల గూర్చి తెలిసికుంటాను.

నన్ను సైన్యంలో చేరమని ప్రభుత్వం అడిగితే, అడిగిన క్షణంలో ఏది సరి అనుకుంటే అది చేస్తా. స్వేచ్ఛతో కూడిన మనస్సు లోబడదు. దానికి తికమక

లేదు. కాబట్టి స్వచ్ఛందమైన మనస్సు స్వేచ్ఛగానే ఉంటుంది.

ఎక్కడచూసినా ఇంత అవినీతి, గందరగోళం ఉంటే ఏదో ఒక వ్యక్తి, ఒక మనుసు స్వేచ్ఛగా ఉన్నంతమాత్రాన ఏం లాభం, ఏం మంచి? అని ప్రశ్నిస్తారు. స్వేచ్ఛతో కూడిన మనసు ఉంటే ఇలాంటి ప్రశ్న వేస్తారా? స్పష్టంగా అయోమయం లేకుండా మనసును ఉంచుకోవడం అంటే అర్థమేమిటి? (BV-169)

## జీవించడం

జీవించడం అంటే ఏమిటో తెలుసుకుందాం. జీవించడంలో వాస్తవ మేమంటే రోజువారి కార్యకలాపాలు, మామూళ్ళు, గొడవలు, ఘర్షణలు ఒంటరి తనవు బాధ, దుఃఖం బీదరికం, సంపద, విజాయలు, విచారాలు- మన మొత్తం జీవిత క్షేత్రాన్ని కప్పివేస్తాయి. దీన్నే మనం జీవించడం అంటున్నాం. అంటే పోరాటంలో, జయించడమో, ఓడడమో జీవితమనుకుంటున్నాము. ఇంకా చెప్పాలంటే అనంతంగా ఆనందానికి అఱ్ఱులుచాచడం (CR-50)

## జీవితాన్ని ప్రశ్నించుకోవాలి

ప్రతివారూ ప్రశ్నించాలి? నా జీవితం క్రమరహితంగా వుందా! నా ఆలోచనా విధానం వారసత్వంగా వుందా! నా జీవిత విధానం అధికారాన్ని అంగీకరిస్తుందా! సామూహికంగా సాగుతున్న అవినీతి ఏమిటి?

ప్రశ్నోత్తర సమావేశం - 30-12-82

## జీవితమంటే సంబంధం

జీవితమంటే సంబంధం. జీవితం వస్తువులతో, మనష్యులతో, అభిప్రాయాలతో, వున్న సంబంధం ద్వారా వ్యక్తమౌతుంది. ఈ సంబంధం అర్థం కావాలంటే మన జీవితం సంపూర్ణంగా వుండాలి. నిన్ను నీవు తెలిసికోడానికి సంబంధమే సరియైన మార్గం. సంబంధం లేకుండా నీవు లేవు. జీవించడమంటే సంబంధం కల్గిఉండడం. సంబంధం కల్గివుండడమే ఉనికి. కేవలం ఉనికికి అర్థంలేదు. మనం ఉన్నాం అని అనుకున్నంత మాత్రాన అది ఉనికికాదు. మనం సంబంధంతో ఉన్నాం

కాబట్టి మనకు ఉనికి వుంది. సంబంధం గూర్చిన అవగాహన లేకపోవడం వల్ల ఘర్షణ పుడుతుంది.

## అభిప్రాయం స్వార్థం

స్వార్థాన్ని (అహంను) కాదనడానికి సన్యాసిగా జీవించడం అవసరమా? మనకు నిస్వార్థ జీవితమనే అభిప్రాయమొకటుంది. ఈ అభిప్రాయమే స్వార్థం లేని జీవితాన్ని అర్థం చేసికోడానికి అడ్డం వస్తుంది. అభిప్రాయమే స్వార్థానికి మరో రూపం. మతాలకీ, ఆశ్రమాలకీ పారిపోకుండ, స్వార్థంతో కూడిన క్రియల యెడ జాగృతి వహించడానికి వీలులేదా? అలాంటి జాగృతి ద్వారా జరిగే పని తీరే వేరుగా వుంటుంది. అది దుఃఖాన్ని బాధను కల్గించదు. (CLII-204)

## కాంక్ష గల జీవితం

కాంక్షలు గల మానవుడు, శాంతిని గూర్చి సోదరత్వం గూర్చి ఎంత మాట్లాడినా శాంతి కలవాడు కాదు. రాజకీయ వాది ప్రపంచాని కెన్నడూ శాంతిచే కూర్చలేడు. అలాగే సంస్థాగత నమ్మకానికి కట్టుబడ్డవాడు కూడ శాంతిమతుడు కాదు. ఎందుకంటే, వాళ్ళు నాయకులకు, రక్షకులకు మార్గదాతలకు, ఆదర్శాలకు నిబద్ధమై పోయారు. ఒకరిని అనుసరిస్తున్నా వంటే ఈ లోకంలో కాని, వేరే భావనా లోకంలో కాని అంటే ఆధ్యాత్మిక ప్రపంచమనబడే దాంట్లో కాని నీ కోర్కె నీవు తీర్చుకోడానికి చూస్తున్నావు. పోటీ తనంలో లేక కాంక్షలో ఘర్షణ వుంది. కాదా? (COLII-162)

## సంబంధంలో ప్రయోజనం

ప్రయోజనం ఉన్నంతవరకే మనం ఒకరితో సంబంధం పెట్టుకుంటాం. అంటే మనకు శరణ్యమైనంత వరకు, సంతృప్తి నిచ్చేంత వరకు ఆసంబంధం వుంటుంది. కాని సంబంధంలో గొడవవస్తే అసౌకర్యం కలిగతే దాన్ని వదిలివేస్తాం దాని అర్థం ఏమంటే మనకు ప్రయోజన మున్నంతవరకు సంబంధం వుంటుంది.

ఈ మాట కష్టం అనిపించవచ్చు. కాని నీ జీవితాన్ని నిజంగా, సన్నిహితంగా

నీవు పరీక్షిస్తే అది సత్యమని గ్రహిస్తావు. వాస్తవాన్ని కాదనడం అజ్ఞానంలో బ్రతకడమే. కనుక సరియైన సంబంధం ఏర్పడదు.

## ధ్యేయం - ఖాళీ

ఒక ఉద్దేశం, ఒక ధ్యేయం, ఏదో సాధించాలని వుంటే ఖాళీ వుండదు. జీవించడనానికీ, ఏకాగ్రత వహించడానికీ కీలక ఉద్దేశముంటే ఇక ఖాళీ ఎక్కడిది? ఏకాగ్రత లేనపుడు కావలసినంత ఖాళీ ఉంటుంది. మనం చూసే కేంద్రం వుందంటే అప్పుడు ఖాళీ చాల పరిమితంగా వుంటుంది. ఖాళీ లేని చోట క్రమత లేదు, స్పష్టతలేదు, కరుణలేదు.

జీవించడంలో ప్రయత్నం, సంకల్ప క్రియలేకపోతే అద్భుతమైన ఖాళీ ఉంటుంది. అది ధ్యానంలో ఒక భాగం (RIC-175)

## ఖాళీలో కాల ప్రమేయంలేదు

ఖాళీ వున్నప్పుడు పూర్తిగా మౌనం- ఏర్పడుతుంది అంటే ఆలోచనా గమనం లేదు. దీనిలో ఎంతో ఆనందం, అద్భుత క్రీడ ఉంటాయి. అపుడు గమనానికి కాల ప్రమేయం లేదు. ఆలోచనతో కొలవడ ముండదు. పూర్తిగా పవిత్రమైంది కాలం లేనిది వుంటుంది. (TWL-176)

## ప్రజ్ఞను మేల్కొల్పడం

మానవ సమస్యలోకి తీవ్రదృష్టి సాధించడమే ప్రజ్ఞను మేల్కొల్పడం. ప్రజ్ఞను మేల్కొల్పితే అంతర్దృష్టి వున్నట్లు. అపుడు ఘర్షణ లేదు. స్పష్టత వుంటుంది. దాన్నుండి తక్షణ క్రియ జరుగుతుంది (TWL- 179)

## ఎందుకు జీవిస్తున్నాం

జీవిత ప్రాధాన్యత ఏమిటి? దేనికి మనం బ్రతుకుతున్నాం? ఎందుకు పోరాడుతున్నాం? ఫస్టు మార్కులు, విశిష్ట స్థానం, గొప్ప ఉద్యోగం, గొప్ప పనితనం, ఎక్కువ అధికారం, మున్నగు వాటికి మనకు చదువు చెపితే, మన జీవితాలు వృథా

కాబట్టి మనకు ఉనికి వుంది. సంబంధం గూర్చిన అవగాహన లేకపోవడం వల్ల ఘర్షణ పుడుతుంది.

## అభిప్రాయం స్వార్థం

స్వార్థాన్ని (అహంను) కాదనడానికి సన్యాసిగా జీవించడం అవసరమా? మనకు నిస్వార్థ జీవితమనే అభిప్రాయమొకటుంది. ఈ అభిప్రాయమే స్వార్థం లేని జీవితాన్ని అర్థం చేసికోడానికి అడ్డం వస్తుంది. అభిప్రాయమే స్వార్థానికి మరో రూపం. మతాలకీ, ఆశ్రమాలకీ పారిపోకుండ, స్వార్థంతో కూడిన క్రియల యెడ జాగృతి వహించడానికి వీలులేదా? అలాంటి జాగృతి ద్వారా జరిగే పని తీరే వేరుగా వుంటుంది. అది దుఃఖాన్ని బాధను కల్గించదు. (CLII-204)

## కాంక్ష గల జీవితం

కాంక్షలు గల మానవుడు, శాంతిని గూర్చి సోదరత్వం గూర్చి ఎంత మాట్లాడినా శాంతి కలవాడు కాదు. రాజకీయ వాది ప్రపంచాని కెన్నడూ శాంతిచే కూర్చలేడు. అలాగే సంస్థాగత నమ్మకానికి కట్టుబడ్డవాడు కూడ శాంతిమతుడు కాదు. ఎందుకంటే, వాళ్ళు నాయకులకు, రక్షకులకు మార్గదాతలకు, ఆదర్శాలకు నిబద్ధమై పోయారు. ఒకరిని అనుసరిస్తున్నా వంటే ఈ లోకంలో కాని, వేరే భావనా లోకంలో కాని అంటే ఆధ్యాత్మిక ప్రపంచమనబడే దాంట్లో కాని నీ కోర్కె నీవు తీర్చుకోడానికి చూస్తున్నావు. పోటీ తనంలో లేక కాంక్షలో ఘర్షణ వుంది. కాదా? (COLII-162)

## సంబంధంలో ప్రయోజనం

ప్రయోజనం ఉన్నంతవరకే మనం ఒకరితో సంబంధం పెట్టుకుంటాం. అంటే మనకు శరణ్యమైనంత వరకు, సంతృప్తి నిచ్చేంత వరకు ఆసంబంధం వుంటుంది. కాని సంబంధంలో గొడవవస్తే అసౌకర్యం కలిగతే దాన్ని వదిలివేస్తాం దాని అర్థం ఏమంటే మనకు ప్రయోజన మున్నంతవరకు సంబంధం వుంటుంది.

ఈ మాట కష్టం అనిపించవచ్చు. కాని నీ జీవితాన్ని నిజంగా, సన్నిహితంగా

## తెలివిగా వుండడమే జీవితం

ఒక పద్ధతికి అంటి పెట్టుకొనేటట్లు జీవితాన్ని మలచలేం. ఒక చట్రంలోకి ఇరికించడానికి దాన్ని బలవంతం చేయలేదు. ఎంత ఘనంగా భావించినాసరే జ్ఞానంలో శిక్షణపొందిన మనస్సు అనేక అంశాలతో సూక్ష్మంగా, లోతుగా ఎంతో ఉన్నతంగా ఉండే జీవితాన్ని కలవలేదు. ఒక ఆలోచనా విధానం ప్రకారం పిల్లలకు శిక్షణనిస్తే ఒక ప్రత్యేక శిక్షణకు గురిచేస్తే ఒక శాఖననుసరించి బోధిస్తే వారు సమగ్రమైన స్త్రీ పురుషులుగా పెరగడానికి నిరోధమేర్పడుతుంది. అందుకే వాళ్ళు తెలివిగా ఆలోచించడానికి అసమర్థులైపోతారు. తెలివిగా వుండడమే జీవిత మొత్తాన్ని చూసినట్లవుతుంది.

## జీవితం - విద్య

సమగ్ర వ్యక్తిని తయారు చేయడమే విద్య యొక్క ఉన్నతోన్నత ప్రక్రియ. అతనికి జీవితం మొత్తాన్ని ఎదుర్కొనే సామర్థ్యం వుంటుంది. ఆదర్శవంతునికి ప్రత్యేకనిపుణునికి మొత్తంతో పనిలేదు. ఒక భాగంతోనే పని వుంటుంది. ఒక ఆదర్శ విధానం కొరకై వెంటాడే వానికి సమగ్రత వుండదు. ఆదర్శవంతులైన ఉపాధ్యాయులెక్కువగా ప్రేమను ప్రక్కను నెట్టారు. వాళ్ళకు ఎండిపోయిన మనసులు, కఠిన హృదయాలు వుంటాయి. పిల్లవాణ్ణి అర్థం చేసికోవాలంటే చురుగ్గా గమనికగా సరియైన అవగాహనలో వుండాలి. ఆదర్శాన్ని పట్టుకొని అనుసరించమని ప్రోత్సహించడం కన్నా మించిన తెలివి కావాలి (ESL)

## క్రొత్త జీవితం

ఆదర్శంతో, ఆశలతో ప్రాకులాడుతూ ఆ ప్రాకులాటను కర్మ అని విప్లవమని అంటారు. ఆదర్శంగాని ఆశగాని నీ మనసులో పుట్టిందే; అది వాస్తవానికి దూరమైంది. మనస్సు దానంతటికది కొత్త దాని నిమిత్తం ఒక పద్ధతిని ఏర్పరచుకొంటుంది. అది గతం యొక్క ఫలమే అంటారు. మీరు కూడా, మీ కొత్త జీవితం కూడ పూర్తిగా పాతదే. అయితే వేరే దుస్తులు ధరిస్తుంది. అంతే!

గతము, భవిష్యత్తు జీవితాన్ని నిలిపేవి కావు. గతం వల్ల జీవితపు జ్ఞాపకాలు, భవిష్యత్తు వల్ల జీవితపుటాశలు మాత్రం వుంటాయి. అవి ఇపుడు జీవించటానికి సంబంధించినవి కావు. అలాంటి మనస్తత్వ చర్య జీవించడంకాదు. మనసు మరణానికి సంబంధించిన పద్ధతిలో పనిచేస్తుంది. మరణం మీద ఆధారపడి చేసే విప్లవం ఇంకా అంధకారమైంది. ఇంకా నాశకరం, దుఃఖకరమైంది (Col II-100)

## అభిప్రాయాలు జీవితం కాదు

నిత్యజీవితంలో కాల ప్రమేయం లేకుండా జీవించే మార్గముంది. అంటే ఈ స్థితి నుండి ఆ స్థితికి జరిగే కాలగమనం పోతుంది. అపుడు ఏం జరుగుతుంది? అసాధారణమైన శక్తి అసాధారణమైన స్పష్టత, వుంటాయి. అపుడు నీవు వాస్తవాలతో వ్యవహరిస్తావు, అభిప్రాయాలతో కాదు. కాని ఎక్కువ మందిమి అభిప్రాయాల్లో చిక్కుకున్నాము. కనుక అలాంటి జీవితాన్ని అంగీకరించాము. దాని నుండి, విడివడడం చాలా కష్టం. దానిలోకి తీక్ష్ణం పరిశీలనా దృష్టి ప్రసరిస్తే ఆ జీవితం ఆగిపోతుంది. (TWL-174)

## కాలంలేని జీవితం

కాలంలో జీవితం ఒక కొలమానపు గమనంగా మనం భావిస్తాం, అది చావుతో సమాప్త మయ్యే గమనం. అంత వరకు వుండే దాన్ని ఏక ధాటియని కొనసాగింపు అని అంటాం. కాని కాలానికి సంబంధం లేకుండా పరిశీలించడం వుంది. అది గతాన్ని గుర్తు పెట్టుకోవడంలేదు. గతం వర్తమానం ద్వారా భవిష్యత్తును మార్చుతూ ఏకధాటిగా ఉన్నట్లుంటుంది. కాని కాలం లేని స్థితిలో జరిగే ప్రతిదాని పట్ల మృతి ఉంటుంది. ఏదైనా జరుగుతూ వుంటుంది. ఆ స్థితి వున్న మనసుకు ఒక రకమైన సౌందర్య భావన ఉంటుంది. కాలంతో పని లేని "కొనసాగింపు" వుంటుంది. (TWL-209)

## ఏకాంత జీవితం

ఏకాంతంగా జీవించడానికి ఎంతో తెలివి కావాలి. ఏకాంతంగా జీవిస్తూనే

సరళంగా వుండడానికి చాలా కష్టపడాలి. స్వయం కల్పిత వ్యక్తి సంబంధించిన గోడల్లో మూయబడకుండ బ్రతకడానికి అత్యంత మెళకువ కావాలి. ఎందుకంటే ఏకాంత జీవనం సౌఖ్యాన్ని కలుగుజేస్తూ అలవాటుకు దారి తీస్తుంది. ఇక వదులుకోడానికి వీలుండదు. ఒంటరి జీవితం మనిషిని దూరం చేస్తుంది తమకు ఇతరులకు హాని కలగకుండా ప్రజ్ఞావంతులు మాత్రమే ఏకాంతంగా జీవించగలరు. విజ్ఞానం ఏకాంతమైనది. ఏకాంతమార్గం దూరం చేసికోవడంలో లేదు. విజ్ఞానానికి మార్గం లేదు. ఎందుకంటే అన్ని మార్గాలు ఏర్పాటుతనం గలవే. దేనికదే వేరు వేరుగా వున్నవన్నీ సమైక్యమైన వనీ, ఒకటే ననీ, సంపూర్ణ మేననీ, అన్నా స్వభావంలో మార్గాలన్నీ ఏర్పాటు తనానికి దారి తీస్తాయి. మార్గమంటే దాని కది వేరైన ప్రక్రియ మార్గం , ధ్యేయానికి లేక వుండవలసిందానికి వేరైందికాదు. క్షేత్రంతోను, దారేపోయే వానితోను, అలా వచ్చిపోయే ఆలోచనతోను వుండే సంబంధాన్ని అవగాహన చేసికోవడంతో విజ్ఞానం ఉదయిస్తుంది. ఏదో కనుగొనాలని తనకు తాను తొలగడంకాని దూరం చేసికోవడంగాని చేస్తే అది కనిపెట్టడాన్ని కట్టిపెట్టి నట్లువుతుంది. సంబంధం ఒక విధమైన ఏకాంతానికి దారి తీస్తుంది. కాని అది వేరై పోవడం కాదు. మూసుకుపోయిన మనసుతో కాక, స్వేచ్ఛతో కూడిన మనసుతో ఏకాంతం వుండాలి. పూర్ణంగా వుండేదే ఏకాంతం. అసంపూర్ణత ఏర్పాటు తనానికి దారి తీస్తుంది. (Col II-101)

## సంబంధం - స్వేచ్ఛ

పార్టీ - దేశం - వర్గం - జాతి - దైవం అలాంటి పెద్ద వాటి ద్వారా గుర్తింపు పొందడం మరో విధంగా అధికారం పొందడం అవుతుంది. నీకు నీవు బలహీనంగా శూన్యంగా వుండడం చేత నీ కంటే గొప్ప దాంతో గుర్తింపు పొందాలనుకుంటావు. ఏదో ఒక గొప్ప దాంతో గుర్తింపు పొందాలనుకోవడం అధికారం పట్ల కాంక్ష వుండడం వల్లనే సంబంధం అనేది స్వయం విప్లవ ప్రక్రియ. మనస్సు ధోరణులు మనకు మనం తెలిసికోలేకుండా బాహ్యంగా క్రమశిక్షణ విధానం, యుక్తి సూత్రం తెచ్చి పెట్టడం అర్థం లేని పని. ఇతరులతో మనకున్న సంబంధాన్ని అర్థం చేసికోవడం ఏర్పాటు చర్య కాదు. అది ఒక గమనం. ఆ గమనంలో నీ ఉద్దేశం, నీ ఆలోచన నీవెంపరలు

వదిలేస్తావు. అది విమోచనకు దారి తీస్తుంది. పరివర్తన కది ప్రారంభం (EL7)

## జీవితంలో శాంతి

పరిసరాల్తో పోరాడడం అవసరం. అలా చేయాలి. కాని శాంతి ముఖ్యంకాదు. ముఖ్యమైంది ఏమిటంటే అర్థం చేసికొని పరిసరాల్నుండి బయటపడడం. దాన్నుండి శాంతి లభిస్తుంది. కేవలం పరిసరాలను అంగీకరిస్తూ శాంతిని అన్వేషిస్తే, నీకు నిద్రకమ్ముతుంది. మరణమే సంభవించవచ్చు. అందుకే సుకుమారపు ప్రాయం నుండీ, చిన్నతనం నుండీ నీలో ఎదిరించే భావం ఉండాలి. లేకపోతే చితికిపోతావు కదా!

ఆడుతూ, ఆనందంతో అరుస్తున్నావనుకో, అది తెలియగానే ఏం జరుగుతుంది? ఆనందంతో వుండడం మానేస్తావు. గమనించావా? కాబట్టినీ చైతన్య క్షేత్రంలో వుండేది సౌఖ్యం కాదు. (TMC-69)

## తర్కం - లోదృష్టి

ప్రశ్న (డా॥ బూమ్) 1) తర్కం అంతర్దృష్టిని ఇవ్వకపోతే ఇంకా చేసేదేమిటి?

2) మనసు ద్వారా కాదు కదా లోదృష్టి వచ్చేది?

కృష్ణమూర్తి : మనసంటే ఏమిటో అనుకునే దాని మీద అంతా ఆధారపడి వుంది. తర్కం మనసును నిశితం చేస్తుంది. స్పష్టం చేస్తుంది. అంతేగాక ఒక మేథావిని చేస్తుంది. వస్తుతత్వాన్ని తెల్పుతుంది. అంతకన్నా అదివేరే దాన్ని ఇవ్వలేదు. మీ ప్రశ్న ఏమంటే, ఇతరమైందిఎలా వస్తుంది?

ప్రశ్న - అది నా ప్రశ్నకాదు. తర్కం మనసును స్పష్టం చేస్తుంది, సరే. అది లోజూపునకు సాధనమా?

ప్రశ్న - లోదృష్టి నిజమైనదైతే, అలాగే సత్యం నిజమైనదైతే, దీన్ని పరీక్షించడానికి తర్కశాస్త్రం అవసరమా?

కృష్ణమూర్తి : అంతర్దృష్టి తార్కికంగా పని చేస్తుందని చెప్పాం. దానికి తర్కం అవసరంలేదు. అంతర్దృష్టి చేసేది సహేతుకంగా, తార్కికంగా, తెలివిగా

వాస్తవికంగా ఉంటుంది.

ప్రశ్న -అంతర్దృష్టిని తర్కవంతం చేసే ఉద్దేశం లేకుండానే అది తార్కికంగా ఉంటుంది. అంతే కదా?

కృష్ణమూర్తి : అవునంతే. (TWOL-231)

ఒకసారి అంతర్దృష్టి ఏర్పడితే మనసు మళ్ళీ చెత్తను అస్తవ్యస్తాన్ని ప్రోగుచేసికోగలదా! అంతర్దృష్టి చెత్త చెదారం కొనే ప్రక్రియ మొదలవుతుంది. కాని లో చూపు ఉంటే కూడగట్టుకోవడం, ప్రోగుచేసికోవడం దేనికి? (TWL-232)

## తర్కం - పరిశోధన ( అన్వేషణ కాదు )

తర్కం ఎప్పుడూ సత్యమనికాదు. కాని తర్కాన్ని హేతువును ఆరోగ్యంగా, వివేకంగా వాడితే హేతువు యొక్క పరిమితులు తెలుస్తాయి. ఇంకా లోతైనా, విశాలమైన మంచి ప్రాతిపదిక గల అనుభూతులు కావాలనే పట్టుదల ఉంటుంది. అది తెలిసిన మార్గాన్ని విశాలం చేయటానికి మాత్రం దారితీస్తుంది. అంతవరకు స్పష్టం మైందనుకుంటాను. పరస్పరం గ్రహిస్తున్నామనీ, పంచుకుంటున్నా మనీ అనుకుంటున్నాను. పరిశోధించే మనసు అంటే అన్వేషించేది కాదు- రెండు విషయాల నుండి పూర్తి స్వేచ్ఛ పొందాలి. (1) అనుభూతి కావాలని కోరడం (2) సత్యానికై అన్వేషించడం. ఎందుకంటే, అన్వేషించడం మొదలు పెట్టినపుడు రకరకాల బోధకులు వద్దకు వెళ్ళడం, రకరకాల పుస్తకాలు చదవడం, రకరకాల సమాజాలలో చేరడం, రకరకాల గురువులను అనుసరించడం- సంతలో కొనుగోలు లాగా- అన్నీ జరుగుతుంటాయి. అలాంటి అన్వేషణకు అర్థం లేదు. (TAI-92)



# కోరిక - కర్మ

కర్మ, క్రియ, చర్య, కార్యం, పని అనే శబ్దాలు సామాన్యంగా ఒకే అర్థాన్ని ఇస్తాయి. సందర్భానుసారంగా వాడుతుంటాము. కొద్దిగా భావభేదం కన్పిస్తుంది. మొదటి నాల్గు పదాలు సంస్కృతం. చివరి పదం తెలుగు. అన్నిటిని పర్యాయ పదాలుగా వాడడం కద్దు.

కర్మకు క్రియకు కాస్త తేడా ఉంది. కర్మకు కారణం ఉంటుంది. క్రియకు కారణం ఉండదు. ఒక హేతువువల్ల కర్మజరుగుతుంది. హేతువులేకుండ క్రియ, దానంతకు అదే జరుగుతుంది. జరిపితే కర్మ, జరిగితే క్రియ. కార్య కారణత్వం వల్ల కర్మ ఉంటుంది. కారణం తెలియకనే క్రియ ఉంటుంది. కర్మకు బంధం ఉంది. క్రియకు బంధం లేదు. ఈ కొద్ది తేడా సూక్ష్మమైంది. ఇది గ్రహించాలి. పాటించ తగినంతగా తెలియకపోవచ్చు. మామూలుగా పని అనే భావంతో ఒక దానికొకటి వాడడం జరుగుతోంది.

కోరికతో జనించేది కర్మ. కర్మకు, బంధానికి మూలం కోరిక. కోరికలేనపుడు కర్మబంధాలుండవు. గతానికి, భవిష్యత్తుకు చెందని కర్మ శుద్ధమైంది. నిజమైన కర్మ వర్తమానానికి చెందింది. అంటే చేస్తున్నది లేక జరుగుతున్నది, వర్తమానానికి చెందింది. అదే క్రియ. సామాన్యంగా కర్మ గతాన్ని అనుసరించి ఉంటుంది. లేదా ఊహకు సంబంధించి ఉంటుంది. అది బంధయుతం. అది సరైన కర్మకాదు. క్రియ అసలేకాదు. నిజమైన ప్రేమజూపడాన్ని (అవ్యాజప్రేమ), కరుణతో స్పందించడాన్ని, కృతజ్ఞత చెల్లించు నిమిత్తం గాకుండా, ఏమీ ఆశించకుండా పని చేయడాన్ని క్రియ అనవచ్చు. సహజమైన భౌతిక స్పందనలు, వాటి ప్రభావాలు క్రియలు అనిపించుకుంటాయి. యజ్ఞయాగాలు, వ్రతానుష్టానాలు, ఇతర కర్మకాండలు కర్మలని అనిపించుకుంటాయి. అయితే జరుగుతున్నట్లు తెలియనివీ, గుర్తింపుగా పెట్టుకోనివీ, ఆడంబర పటాటోపాలు లేనివీ అయిన పనులను క్రియలని అన్నారు, అకర్మలని అన్నారు. వర్తమానంలో జరిగేదాన్ని నిజమైన కర్మ లేక క్రియ అని వాడడం జరిగింది.

# కృష్ణజీ:

## తప్పించుకోవడ మెందుకు?

ఇది నాకర్మ, ఇది విధి, ఇదిదైవ నిర్ణయం అనడం - ఇది తప్పించుకొనే మార్గాలు. ఇలాంటి వాటికి లోబడకుండా, కాదన కుండా (తటస్థంగా) నిలబడితే ఏ మౌతుంది? నాస్థితి ఏమిటి? నా దుఃఖం ఏమిటో, దాన్ని అనుసరిస్తూ ఉంటే ఏమౌతుంది(FLF)

## అపేక్ష లేనిది జీవితం

కర్మకు వ్యతిరేకం అకర్మకాదు. నిజంగా అది నిష్క్రియ. అంటే ఏమి? ఏ విధానం లేకుండా, ఏ కోరిక లేకుండా మనసు ఉంటుందా? ఎట్లా వుంటుంది? అది సాధ్యమే. అంటే అది వర్తమానంలో ఇప్పటికిప్పుడు జీవించడమవుతుంది. అది ఇప్పుడు జీవించడం. రేపటి జాగ్రత్త అని కాకుండా జీవించడం. అది నిస్పృహ, నిర్లక్ష్యం కాదు. (COLii-99)

## నిజంగా జీవస్తున్నామా?

నిజంగా మనం జీవించడం లేదు. మరణాన్ని వెన్నాడుతున్నాం. గతం గురించి, లేదా భవిష్యత్తు గురించి ఆరాట పడుతున్నాం. జీవించడమంటే ఒక విప్లవం. జీవించడానికి విధానం లేదు, మరణానికి విధానం ఉంది. అది గతమో లేక భవిష్యత్తో లేక ఊహా జగత్తో! అంటే మరణానికై బతకడమవుతుంది; మరణాన్ని ఆహ్వానించడమవుతుంది. అది జీవితాన్ని ఆహ్వానించడం కాదు.(COLii-99)

## అసలు క్రియ

విధానం, ఊహ- అలాంటి పైపై వాటికి లోబడకుండా వాటితో తృప్తి పడకుండా ఉన్నపుడు ఆదర్శాలు, గురువులు, మతాలు, సంప్రదాయాలు, పైపైవి మాత్రమే నని అర్థమవుతుంది. అలాంటి అసంతృప్తితో (అంటే పైపైవన్నీ నిష్ప్రయోజనం అన్నభావనతో) ఉన్నపుడు, మరియు సావధానంగా, శ్రద్ధగా ఉన్నపుడు

అంటే ఆసక్తి ఉన్నపుడు తెలివిపుడుతుంది. ఆతెలివి లోదృష్టి నిస్తుంది. దాన్నుండి అసలు క్రియ మొదలవుతుంది. అది వెంటనే జరుగుతుంది.

పైపైన తటస్థించే అలాంటి ఉచ్చుల్లో పడితే, బయట పడడం సాధ్యమా? వాటిని ధ్వంసం చేయగలవా? బయట పడేటట్లు చేయగల ఆ అగ్ని అత్యున్నత ప్రజ్ఞ అవుతుంది. అది అంతర్దృష్టి నిస్తుంది, చర్య వెంటనే ఉంటుంది.

కర్మ అంటే రేపటిది కాదు. కారణం లేకుండా కార్యం ఉంది. కారణం లేకుండా కార్యముంటుందనేది మేధావులకు పెద్ద సమస్య. అవును, కార్యం ఉంటుంది. అది గతం మీద, భవిష్యత్ సిద్ధాంతం మీద ఆధారపడనిది. స్వేచ్ఛతో కూడింది. అది తెలివి నుండి జనించినది లోదృష్టివలన మాత్రమే సాధ్యం. (TWL-233)

## అంతర్దృష్టి సామర్థ్యం

అంతర్దృష్టి వుంది. దానికి సామర్థ్యం వుంది; అది హేతువుకు, తర్కానికి, క్రియకు ఉన్న సామర్థ్యం. క్రియ పూర్తి అయింది. అయితే అది తదుపరి జరిగే క్రియలోకి దృష్టి సారిస్తుందా?.

## క్రియ అంటే

క్రియ అంటే చేసిందీ కాదు, చేయనున్నదీ కాదు, చేస్తున్నది మాత్రమే. విశ్లేషణ వర్తమాన క్రియను అడ్డగిస్తుంది. ఎందుకంటే విశ్లేషణలో కాలం ఉంది. కాలం క్రమంగా లయమై పోవడం కూడ జరుగుతుంది. విశ్లేషణలో ప్రతి పొరనూ ఇంకా పొర తర్వాత పొరను పరిశీలించడం జరిగిపోతూ వుంటుంది. ఆపరిశీలన పూర్తి కాదు; సంపూర్ణమూ కాదు. పరిశీలన నుంచి విశ్లేషణ మొదలవుతుంది. అది అసంతృప్తిని కల్గిస్తుంది.(TAI-60)

## విశ్లేషణ గతానికి చెందింది.

విశ్లేషించేదెవరు? గతమూ, గతవిశ్లేషణాల జ్ఞాన సంచయమూ. అలా గతంతో, గత జ్ఞానంతో వర్తమానాన్ని విశ్లేషణ చేస్తాడు.(TAI-61)

## చేస్తున్నదే కర్మ

కర్మఅంటే ఏమిటి? కర్మ భవిష్యత్తుది కాదు, గతానిది కాదు. చేస్తున్నది మాత్రమే. అది ఒక తీర్మానం యొక్క ఫలమా? దాన్ని బట్టి నిర్ణయముంటుంది లేక నమ్మకం మీదో నమ్మకాన్ననుసరించో చేయడమా? అనుభవం మీద ఆధారపడిందా? అనుభవాన్ని, జ్ఞానాన్నీ అనుసరించి చేసేదా? అలాంటి దయితే, ఆక్రియ గతానిదే. మనసంబంధం కూడ గతానికి సంబంధించిందే. వర్తమానంలోనిది కాదు. (TAI-334)

## కోర్కెను కాదనాలి

మనం మార్చాల్సింది పైకి ఎక్కాలనే కోర్కెను; గొప్పతనం పొందాలనే కోర్కెను; విజయం పొందాలనే కోర్కెను. మనకు ఎప్పుడూ జయించాలని ఉంటుంది. కాదా? అదేతప్పు. కర్మలో తప్పులేదు. ఇంకా ఏ సంజాయిషీలోనూ కాదు. వాస్తవంగా, మనం అందరికంటే పైన ఉండాలని మనకు ఉంటుంది. పూర్తిగా పైన కాక పోయినా నిచ్చెన ఎక్కగలిగి నంతవరకైనా పైకి ఉండాలని ఉంటుంది. గొప్పగా కావాలనే తాపత్రయం ఉన్నంత వరకూ, లోకంలో ఎవరిలాగానో తయారు కావలనే తాపత్రయం ఉన్నంత వరకూ పేదలు, ధనికులు, దోచుకొనేవారు ఉంటారు. ఇలాంటి వారే దోచుకోబడేది కూడ.(LA-47)



# అతీంద్రియత - లైంగికత

మిస్టరీ, మిస్టిసిజం అనేవి సామాన్య మేధస్సుకు అందేవికావు. అంటే వాటిని సహేతుకంగా వివరించలేం; వాటి చర్యలు ఎవరంటేవారు చేయలేరు. అవి బహిరంగంగా జరిగేవి కావు. సామాన్యశక్తికి మించినట్టివి. వాటి రహస్యం ఇతరులకు తెలియదు. కాని మహిమల రూపంలో బయట పడతూ ఉంటాయి. అవి అయదార్థాలుకావు. చమత్కారాలు కావు. కనుకట్టు విద్యలు కావు. ఇంద్ర జాలం కాదు. అందుచే వాటిని అతీంద్రియ జ్ఞానానికి సంబంధించినవి అని చెప్పుకోవచ్చు. ఈ శక్తి మానవుల్లో ఉంది. అది ఎప్పుడూ ఉంటుందని చెప్పలేం. ఒకేలా ఉంటుందని కూడ చెప్పలేం. అది శాశ్వతమైందనీ అనలేం. మరో విధంగా చెప్పాలంటే, మహిమలు కేవలం ఇంద్రియాలతో జరిగే చర్యలు కావు. ఇంద్రియాల సహాయం ఉంటుంది. ఇంద్రియాలతో ఎంతవరకు సంబంధం ఉంటుందో చెప్పలేము. కాని ఇంద్రియాలకు మించిన అతీంద్రియ చర్యలు అవి. వాటిని సిద్ధులనీ, మహిమలనీ అంటున్నారు.

ఆ శక్తికి అభూత కల్పనలు కల్పిస్తారు. ఆ శక్తిని దైవానికి అంటగడు తుంటారు. సిద్ధులకు దైవత్వం అంటగట్టి ఆరాధనలు ప్రారంభిస్తారు. భౌతిక ప్రయోజనాల కోసం వాడుతుంటారు. ఇకపోతే, దానిననుసరించి ప్రచారాలు, పేరు ప్రఖ్యాతులు, లాభాలు, స్వార్థాలు, భజనలు ఇలాంటి క్రియా కలాపాలన్నీ ఉండనే ఉంటాయి. ఈ క్రియాకలాపాలల్లో వాస్తవం ఉండదు. పైపై ఆర్భాటాలు చూసి యదార్థం తెలుసుకోలేము. ఆర్భాటాలు స్వల్పంగా ఉన్నా, అధికంగా ఉన్నా సరే, వాటివల్ల ప్రయోజనంలేదు. ఎల్లప్పుడూ వుండదు.

ఈ ప్రపంచంలో తెలియని విషయాలు అనేకం. మనిషికి వశంగాని ప్రకృతి శక్తులనేకం ఉన్నాయి. ఎన్నెన్నో రహస్యాలు, మర్మాలు! వాటిలో కొన్ని మానవుని అనుభవంలోకి వస్తుంటాయి. కాని అవేమిటో, వాటి మూలస్వరూపం ఏమిటో, అతనికి తెలియదు. అలాగే గుహ్యజీవిత సంఘటనలు కూడ అవి ఎలా ఎందుకు జరుగుతుంటాయో మనిషి చెప్పలేకున్నాడు. నిజానికి, తెలియని విషయాలను తెలియవు అని ఒప్పుకోవాలి. ఉదాసీనత లేక తటస్థం వహించాలి. అంతేతప్ప ఊహాతీతవర్ణనలు గాని, నిర్ధారణలు గాని కల్పించరాదు. దైవశక్తికి వాటిని అసలు

జోడించనే రాదు. దైవం అంటేనే తెలియదు కదా! ఒక విషయాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేస్తున్నపుడు, దాన్ని ముందే ఊహించరాదు. దానికి మరొకటి ఆపాదించకూడదు. అలా చేస్తే, అసలు ప్రయత్నమే వృధా అవుతుంది; అది ఎప్పటికీ తెలియదు. ఇవన్ని కూడ మానసిక విషయాలు. వీటికి భౌతికమైన శాస్త్రీయ విషయాలతో పోల్చడానికి వీల్లేదు. వాటిని x y అనుకుందామన్నా అలా కుదరదు. అలా చేస్తే తప్పుగా పరిణమిస్తాయి.

పోతే, జీవితంలో గుహ్య భాగం చాల పరిమితం, దాని ప్రయోజనం అంతకంటే పరిమితం. అందుకే అనల్పజ్ఞులైనవారు దాన్ని అంతగా పట్టించుకోరు. నిర్లిప్తత చూపుతారు. ఏ శక్తి ఎవరికి ఎందుకు, ఎలా వస్తుందో తెలియదు. కారణం తెలిస్తే అపుడు బయటపడుతుంది. అప్పటివరకు దాని వినియోగం, ప్రయోజనం స్పష్టంగా తెలిసి జరగదు. అది ఎంతవరకు నిజమైనదో కూడ తెలియదు. కొంత కాలానికి పరిశోధకులు దాని వాస్తవం బయట పెట్టవచ్చు. అంతవరకు దాని యెడ నిర్లిప్తంగా ఉండడమే మంచిది.

గత చరిత్ర పురుషులకు, పేరు ప్రఖ్యాతులున్న వారికి ఈ శక్తులున్నాయని అనడం ఆచారం. ఏమీ ఎరుగనివాళ్లకు కూడ వీటిని ఆపాదించడం, ఈ ఆచారంలో ఒకభాగం. ఇలాంటిశక్తి ఉన్నదని చెప్పి, దాన్ని నిరసించిన వారు కూడా ఉన్నారు.

కృష్ణమూర్తిలో మార్పు వచ్చిన తీరు విచిత్రంగా ఉంది. అది కూడ భౌతికంగా తెలిసిన విషయం మాత్రమే. కాని లోలోపల ఏం జరిగిందో స్పష్టంగా చెప్పలేం. నిజంగా ఏం జరిగిందో దాని అంతర్గతమైన తీరుతెన్నులు ఆయన కూడ స్పష్టంగా చెప్పగలరో లేదో. అయితే ఆయన ప్రవర్తనను బట్టి పరిణామఫలితం గొప్పదనీ, అద్భుతమైందనీ, ఆదర్శవంతమైందనీ చెప్పవచ్చు. ఆయనలో గుహ్య జీవిత విశేషాలు చాల తక్కువ. కాని తన చేతుల్లో స్వస్థపరచుశక్తి ఉన్నదనేవారు. ఒకరిద్దరిని బాగు చేసినట్లుకూడ ఆయన చరిత్రలో ఉంది. దాని కాయన అంతగా ప్రాముఖ్యత నివ్వలేదు. దాన్ని ప్రచారం చేయలేదు. దాన్ని వాడడం పనిగా పెట్టుకోలేదు. దాన్ని ప్రోత్సహించలేదు. పైగా నిరసించారు. కాబట్టి మనం భూతద్దాలతో చూడవలసిన పనిలేదు.

లైంగిక విషయం చాల ఇబ్బంది కలుగుజేస్తుంది. అసలా విషయం ఎత్తుకుంటే వినేవాళ్లకు ఎన్నో ఊహా గానాలు చెలరేగుతాయి. ఎందుకంటే జీవితంలో అది అంతగా ప్రధానమైంది. ఇది వాస్తవం. కాదనడానికి వీలులేదు. అయితే అది అంత అప్రధానమైందని చెప్పి అణచివేయడం వల్ల దానికి చిలవలు పలవలు ఎక్కువగా పుట్టుకొస్తున్నాయి. అవి ఘర్షణకు కారణమౌతున్నాయి. ప్రధానం అప్రధానం అనే వాటికి ఎంతవ్యత్యాసం వుందంటే వాస్తవం అవాస్తవం మధ్య ఉన్నంత వ్యతిరేకత వుంది. ఈ వ్యత్యాసమే మనుషుల్ని వేధించి పీడిస్తుంది.

సెక్సులో ఆకర్షణ ఏమిటి? అది సరిగా తెలియదు. తెలిసికోవాలని ప్రేరేపిస్తుంది. సెక్సు సర్వత్ర వుంది. ఆకర్షణీయంగా వుంది. దాన్నందుకోవాలని, పొందాలని, అనుభవించాలని తహతహ తెచ్చి పెడ్తుంది.

ఒక విధంగా స్త్రీ పురుష సంబంధాన్ని సెక్స్ అనవచ్చు. స్త్రీ పురుషులు దేనివల్ల పరస్పరం ఆకర్షింపబడతుంటారు? 'గోవు వెంట దవులు కోడె భంగి' అనుసంబంధంలో తన్మయత్వం వుంది. అదే తన్నుతాను మరచి పోవడం, నిరామయానందం పొందడం. మనస్సు అక్కడ ఆగిపోతుంది. అక్కడ ఆలోచనకు తావు లేదు.

సెక్సుకు మూలం ఏమిటి? శృంగారాన్ని కూడ సెక్స్‌పరంగా చెప్పవచ్చు. శృంగారం ఒక మనోభావన. అది ఆలోచన నుండి పుడుతుంది. ఆలోచనపరమైన శృంగారం, సెక్స్ భావన కలిగించి, ఆలోచనరహితమైన ఆనందానికి దారి తీస్తుంది. అవునా కాదా? ఆలోచన ద్వారా అనాలోచన కలుగుతుందంటే ఏదో లోపంగా, అసంపూర్ణంగా, అహేతుకంగా కనిపిస్తుంది దీన్ని కాస్త లోతుగా పరిశీలించాలి!

మనసు, శరీరం కలవాడు మనిషి. భావన మనసుకు సంబంధించింది. అదిశరీరాన్ని ప్రేరేపిస్తుంది. ఆ రెంటికి సయోధ్య కుదిరితే సెక్స్ క్రియ పూర్తి అవుతుంది. అంటే మనసు శరీరం ఉన్నంత కాలం సెక్స్ సంబంధం కోద్దో గొప్పో తప్పదన్నమాట. దేహసంబంధమైంది కనుక దాన్ని లింగసంబంధం అన్నారు. దేహాన్ని లింగం అంటారు. కాని ప్రత్యేకంగా సృజన క్రియకు కారణభూతమైన, మూలమైన ఒక శరీర భాగాన్ని లింగం అంటారు. లింగ సంబంధమైన ప్రక్రియ ఉండుటచే

సెక్స్‌ను లైంగికం అన్నారు. ప్రకృతిలో ఇది ఎంతో సహజమైంది. ముఖ్యమైంది, అవసరమైంది. అలా అగుపడుతున్నది. కదా! కనుక అనవసరంగా బిడయపడ నవసరం లేదు.

బయటికి శృంగారాన్ని కాదనే భక్తులు తత్త్వవేత్తలు కూడ దీనికి ప్రముఖ స్థానమిచ్చి 'మధురభక్తి' యని ముచ్చటగా పేరు పెట్టుకొని దాంతో కాలక్షేపం చేస్తున్నారు. దానికి దైవ ముద్ర, రాజముద్ర లభించాయి. స్తోత్ర పాఠాల్లో, కావ్యాల్లో, ఆదిపురుషుల్లో, దేవతల్లో, దేవుళ్లలో కావలసినంత పచ్చి శృంగార వర్ణనలు, అంగాంగ- సంభోగాది వర్ణనలున్నాయి. శృంగార పురుషుడుగా కృష్ణునికున్నంత ప్రచారం, పేరు అపరిమితాలు. చిన్నప్పటి నుంచి ఆయనకు అదే పని. కోకలెత్తుకెళ్ళేవాడు. వయసు రాగానే ఆయన ఎనిమిది మంది భార్యలను ఆనందపరిచాడు. వాళ్లతో సరిపెట్టుకోకుండ ప్రత్యేకంగా రాధకు అంకితమై పోయాడు. ఇంకా పదహారువేల మందితో స్నేహం చేశాడు. ఇదంతా ఒక ఎత్తు. ఇంతవరకు బాగానే వుంది. అయినా ఆయన బ్రహ్మచారే! సహజ శృంగారభావ ప్రభావం అంతవరకు ఉంటుందని అర్థం చేసికోవచ్చు. ఆ మెచ్చుకొనే వాళ్ళే బజారులో ఇద్దరు యువతీ యువకులు ఇష్టపడి నడిచివెళ్తుంచే చెవులు కొరుక్కుంటారు. దుష్ప్రచారం చేస్తారు. అలాంటప్పుడు కృష్ణుని చేష్టలు కూడ అభ్యంతరమైనవని ఖండించాలి. లేదా స్త్రీ పురుషులు స్నేహం యెడ అనవసరంగా జుగుప్స, వ్యతిరేకత ప్రకటించరాదు. వైరుధ్యంతో కూడిన సంస్కృతి చాల ప్రమాదకరమైంది. ఈ వైరుధ్యం మహాభయంకరమైంది. వైరుధ్యమున్నంత కాలం సంఘర్షణ సమసిపోదు.

అంతే కాదు. ఒక మనిషిని వెన్నుపోటు పొడవాలంటే, భ్రష్టుడనిపించాలంటే వాడే బలమైన ఆయుధం లైంగిక అపవాదం. దీన్నిబట్టి ఈ సంస్కృతి ఎంత క్రూరమైందో అర్థమవుతుంది. సహజమైన లైంగిక సంబంధం కుటిలత్వానికి గురి కారాదు. దీని లోతుపాతులు క్షుణ్ణంగా తెలిసికోవడం వల్ల మనసు స్వేచ్ఛ పొందుంతుంది. సరళంగా వుంటుంది.

లింగసంబంధం జీవితాలకు తృప్తినివ్వడమే గాక సృష్టికార్యానికి

దోహదపడుతుంది. సృజనత్వంలో క్రొత్తదనముంది. క్రొత్తదనం నిజమైన ఆహ్లాదాన్నిస్తుంది. లింగ సంబంధానికి పుణ్యాపాపాలంటగట్టడం మానవులు స్వార్థబుద్ధితో చేసేపని. పుణ్యాపాపాలు లేవు. పవిత్రత, అపవిత్రత అంటగట్టరాదు. లాభనష్టాలున్నాయి. నీతినియమాలున్నాయి శాసనాలున్నాయి. మన అవసరం కొద్దీ అనుకున్న దానికి అనువుగా దాని మంచిచెడ్డలుంటాయి. సమాజంలో ఘర్షణలకు తావీయరాని క్రమంలో నియమ నిబంధనలు పెట్టుకోవడం సముచితం. వాటిని పాటించడమే నీతి, నియతి. నీతి రాజ్యాంగబద్ధమైంది.

ఆకలిదప్పులెలాంటివో లైంగిక ఇచ్ఛ అలాంటిది. దాన్ని హేతుబద్ధంగా, నీతి దాయకంగా అంటేనియతితో వినియోగించుకోవడం మానవుని విద్యుక్త ధర్మం. "అందం చూడవయా, ఆనందించవయా" అన్నారు. అంతవరకు మానవమాత్రునికి అవసరమే. అంతమాత్రనా ప్రమాదం లేదు. చూచిందల్లా తనకు కావాలన్నపుడే చిక్కులు మొదలౌతాయి. నిజంగా ఆనందించడానికి ఆలోచనతో పనిలేదు. ఆలోచన ప్రవేశించినపుడే బంధాలు ముసురుకుంటాయి. పునఃక్రియలు, పునరానుభూతులు సహజానందాలు కావని గ్రహించాలి.

సెక్స్ చాల సున్నితమైంది. దాన్ని కాదన్నా చిక్కు, అతిగా ప్రవర్తించినా చిక్కే. దాన్నొక సమస్యగా భావించరాదు. పుట్టుకున్నా వదలిపెట్టినా సరళంగా జరగాలి. అది బంధం మాత్రం కారాదు.

-- జె.శ్రీ.

## కృష్ణజీ :

### అతీంద్రియత:

అతీంద్రియతను గూర్చి చాల మూఢత్వం, సమ్మోహం ఉన్నాయి. అది అస్పష్టమైంది, చెప్పటానికి వీలులేని భావన. అది భ్రాంతిని కల్గిస్తుంది. దీని అర్థం ఇంతే కాదు. రాజీకయమైన, మతపరమైన, భవిష్యత్తుకు సంబంధించిన భ్రమలను తొలిగించుకోవడం చాల కష్టం. మనకు మనం ఏదీ కనుగొనం. మనం కనుగొన్నామను

కుంటాం. అదిభ్రమల్లోకల్లా పెద్ద భ్రమ. ఆభ్రమే ఆలోచన. దాంట్లోకి స్పష్టంగా చూడడం చాల కష్టం. ఈ పిచ్చిని మానవుడు తనచుట్టూ తానల్లుకున్నాడు. దీన్ని చూడాలంటే, దీన్నుండి బయటపడాలంటే గొప్ప స్థిరమైన మనసుండాలి. చూడడం, స్వేచ్ఛ పొందడం రెండూ చాలా ఆవశ్యకాలు. చూడాలనే తహతహ నుండి బయటపడడం, శాస్త్ర సాంకేతిక మతపరమైన అన్వేషణనిచ్చే ఆశనుండి బయట పడడం ముఖ్యం. ఆ ఆశే భ్రమలు కొల్పుతుంది. కనుక స్వేచ్ఛగా చూడాలి. స్వేచ్ఛవుండాలికాని ఆహ్వానింపబడడం కాదు అపుడు మనసు అప్రమేయ మవుతుంది.(TAR-72)

ఈ భ్రమలు ఇంట్లో తయారైనవే. సొంతంగా బయటికొచ్చినవే. ఇవి ఆదర్శాలు. ఇవి గురువుల, రక్షకుల యొక్క ఆదర్శప్రాయమైన సంకల్పాలు, భవిష్యతును గూర్చిన భావాలు. ఆత్మప్రీత్యర్థం ఏర్పడ్డాయి. ఒకేరీతిగా వుండే విసుగునుండి బయట పడే ప్రయత్నంలో ఆత్మ అంతర్గత బహిర్గత ఉద్వేగాలు, ఉద్రేకాలు తెచ్చిపెట్టుకుంటుంది. ఇవి ఆత్మసమర్పణకు. ఆత్మవిస్మరణకు ప్రత్యామ్నాయాలు. విజయవంతమయినా ఆ విజయం విసుగు వృద్ధిచేయడంలోనే వుంటుంది. ఒకదాని కొకటి ప్రవేశపెడతాం. ప్రతిదానికి ఒక సమస్య, ఘర్షణ, బాధ ఉంటాయి. (COLI-100)

## స్వస్థపరచు శక్తి

శారీరకరుగ్మతలను కొంతవరకు తొలగించి మానవులను స్వస్థపరచు శక్తి, కృష్ణ జీకి వుంది. విమానప్రయాణంలో ముగ్గురు వ్యక్తులను బాగుచేసినట్లు మేరీ లుట్యెన్స్ వ్రాసిన కృష్ణజీ జీవిత చరిత్ర(Krishnamurti-The years of Fulfilment) లో ఉంది. ఆ ముగ్గురిలో ఒక అంధురాలు కూడ ఉంది. ఆవిషయం ఇతరులకు చెప్పవద్దని ప్రచారం చేయవద్దని కోరాడు. కేవలం భౌతిక బాధానివారణ నిమిత్తం జనులు అతనివద్దకు రావడం ఇష్టం లేదు. 'నేను హృదయాలను బాగుచేయడానికి వచ్చాను, శరీరాలను కాదు' అని ఆ సందర్భంలో చెప్పారు.

ఆచార్య వినోబాభావే కార్యదర్శియైన విమలా ఠాగూర్ తలపై చెయ్యిపెట్టి ఆమె కంటి ఇబ్బందిని తీర్చినట్లు పూపుల్ జయకర్ 'కృష్ణమూర్తి జీవిత చరిత్ర'లో

వ్రాసింది. 'నాచేతుల్లో స్వస్థపరచు శక్తి ఉందని మా అమ్మ అంటూండేది అని ముసి ముసి నవ్వులతో నును సిగ్గుతొ కృష్ణజీ చెప్పినట్లు వ్రాసింది.

"చాలమంది మనుషులు నావద్దకు ముసుగు వేసికొని వస్తారు. వాళ్ల మనసులో ఏముందో నేను చదవగలను. కాని అట్లా చేయను. ఎందుకంటే అది ఇతరుల ఉత్తరాలు చదవడం లాగ వుంటుంది" అని చెప్పారు. అలాంటి అంతశ్శక్తి యొక్క పునాది, ప్రభావం, పరిమితి గూర్చి ఇదమిత్థంగా చెప్పలేము. దానికి ఎక్కువ విలువ ఇవ్వడంగాని, ఆతీతశక్తియని ఊహాగానం చేయడం గాని అనుచితమని అనారోగ్యకరమని చెప్పవచ్చు. అలాంటిదేదైన స్వానుభవంలో ఉంటే అంతవరకు మాత్రమే మాట్లాడుకొనవచ్చు. (జె. కె. జీవన దర్శనము అనుగ్రంధము నుండి)

## స్వీయాను భూతులు : (నోట్‌బుక్‌లో)

తన అనుభూతులు కొంతకాలం నోట్‌బుక్ లో వ్రాశారు. 'ఆ సమయాన ఒక  అవ్యక్త భావన ఏర్పడింది' అని ఆ నోట్‌బుక్‌లో 1961 జూన్ 18 మొదటి వాక్యం. 'అది ఆదినమంతను నింపివైచింది. ఒకవిధమైన గొప్ప సౌందర్యం, శక్తి, సౌమ్యత్వం అందులో ఇమిడి వున్నాయి. ఇతరులు కూడ దాన్ని గమనించారు. అపారం - పవిత్రం - ఆశీర్వాదం - అన్యత్వం - విస్తృతం - అప్రమేయం - నిత్యసమన్వితం - తేజఃపరిపూర్ణంగా అది వుంది. అది కోరితే లభించేది కాదు, అని పేర్కొన్నారు. 'అన్యత్వం' అతని నిత్యానుభూతిలో ఒక భాగమై వుండేది. పూర్వంలా వెన్ను మెడ తలలలో వేదనానుభూతి కల్గుచుండేది. ఈవేదనానుభూతి ఒకప్పుడు 'అది' తటస్థించిన స్థితిలో ఒకభాగంగాను, మరొకప్పుడు వేరుగాను సంభవించేది. అతడు రెండు విధాల అనుభూతులకు లొనయ్యేవాడు. వేదనానుభూతులకు లోనైన రోజుల్లో రాత్రులందు ఎప్పుడు మెలకువ వచ్చినా, అదే అన్యత్వ అనుభూతి అగుచుండేది. తల పైకెగిరి పోయినట్లు భావించేవారు. "బుద్ధికి శుద్ధి అవసరం. అసూయ, ద్వేషం, కోర్కె, నిబద్ధతల నుండి మెదడు పరిశుభ్రమైనపుడు మాత్రమే సంపూర్ణమైన సదవగాహన కల్గుతుంది. అదే సంపూర్ణత" అని వ్రాశాడు.

('జె.కె. జీవన సదర్శనము' అనుగ్రంథంనుండి)

## లైంగిక జీవితం

### *ఆలంబన ముఖ్యమైతే!*

లైంగికమైన ఆత్మవిస్మృతిలో మనకు కొంత సుఖం వుందని చూస్తాం. కనుక మనం కోరింది పొందడానికి సెక్స్‌ను వినియోగిస్తాం. దేని ద్వారానో సుఖం పొందాలంటే అది ఘర్షణ తెచ్చిపెడుతుంది. ఎందుకంటే సుఖంకన్నా సాధనం విలువైంది, ప్రాముఖ్యమైంది. అవుతుంది. కుర్చీ అందం ద్వారా నేను సుఖాన్ని పొందడంవుంటే, అపుడు కుర్చీయే నాకు ముఖ్యమై పోతుంది. దాన్ని ఇతరులనుండి రక్షించాలి. ఈగొడవలో ఒకప్పుడు కుర్చీ అందంచూసి పొందిన సౌఖ్యం పూర్తిగా మరుగున పడి పోతుంది. ఇక నాకు మిగిలింది కుర్చీయే. నిజానికి కుర్చీకి ఉన్న విలువ చాల స్వల్పం. కాని నేను దానికి అమితమైన విలువనిచ్చాను. ఎందుకంటే నా సౌఖ్యానికి అది ఆలంబనమైంది. కనుకసాధన సౌఖ్యానికి ప్రత్యామ్నాయమైంది. (COLI-100)

## సెక్స్-ఆత్మవిస్మృతి

సెక్స్ అనేది ఆలోచన వల్ల ఉబికించేదేనా? సెక్స్ అనేది సంతోషమా, ఉల్లాసమా? తోడా? దానిలో సౌ కుమార్యం ఉందా? అది స్మృతి లేక ఆలోచనవల్ల బలపడిందా? లైంగిక క్రియలో ఆత్మవిస్మృతి, ఆత్మ విసర్జన, వుంటాయి. జీవితంలో భయం, ఆదుర్దా, చింతలు లేని ఒకవిధమైన భావన వుంటుంది. ఈ సౌకుమార్య స్థితిని, ఆత్మ విస్మృతిని జ్ఞాపకముంచుకొని మళ్లీ కావాలని కోరడం, నెమరు వేసుకోవడం, అది తిరిగి తటస్థించే సందర్భం వరకు జరుగుతుంటాయి. సెక్స్ అనేది మృదులమైనదా లేక కేవలం అయిపోయిందాన్ని గుర్తుకు తెచ్చుకోవడమా? మళ్లీ చేసి దాన్ని పొందాలనే కాంక్ష? ఎంత ఆనందదాయకమైనా తిరిగి తిరిగి చేసేపని వినాశకర ప్రక్రియ కాదా?(TAR-79)

## దైహికవాంఛ

దైహిక వాంఛను, మానసిక ఇచ్ఛను ఎందుకు వేరు చేస్తారు? మరొక ప్రశ్న

వుంది, పూర్తిగా వేరైన ప్రశ్న - పర్వత సౌందర్యాన్ని లేక పువ్వు యొక్క అందాన్ని చూడడం నుండి సెక్స్‌ను ఎందుకు వేరు చేస్తారు? ఒకదానికి అంత ప్రాముఖ్యత నిచ్చి రెండవదాన్ని ఎందుకు నిర్లక్ష్యం చేస్తారు?

## ప్రేమ-సెక్సు

ప్రేమ, సెక్స్ రెండు వేరు వేరని అనలేదే! ప్రేమ సంపూర్ణమైందని అన్నాం. దాన్ని ముక్కలు చేయరాదు. ఆలోచన స్వభావరీత్యా విభజనాత్మకం. ఆలోచన ఆధిక్యం వహించిందంటే ఇక అక్కడ ప్రేమ లేనట్లే. మనిషికి సాధారణంగా తెలిసిందేమంటే కేవలం తెలియడమే - లైంగిక ఆలోచన, అంటే ఆనందపు ముద్దను నెమరువేసికోవడం, తిరిగి పొందడం. కనుక మనం ప్రశ్నించాలి, - ఆలోచనకు, కోర్కెకు సంబంధంలేని సెక్స్ ఏమైనా వుందా?

## సెక్సు పాతది

కోర్కె, ఆనందం లేకుండ ప్రేమ వుందా? కోర్కె, ఆనందం లేకుండ సెక్స్ వుందా? ఆలొచన ప్రవేశించనట్టి సంపూర్ణ ప్రేమ అంటూవుందా? సెక్స్ అనేది గతానిదా, లేక ప్రతిసారి క్రొత్తదా? ఆలోచన ఎలాగూ పాతదే. కనుక మనం ఎప్పుడూ క్రొత్తదానికి పాతదానికి వ్యత్యాసం చూపిస్తూనే వుంటాం. పాతదాన్నుండే మనం ప్రశ్నిస్తున్నాం, పాత మాటల్లోనే మనకు సమాధానం కావాలి. ఆలోచన ప్రక్రియ ఏమాత్రం లేకుండ సెక్స్ వున్నదా అన్నపుడు, మనం పాతదాని నుండి బయట పడలేదన్న మాటే కదా! పాతదానితో ఎంతో నిబద్ధమైపొయాం, అందుకే కొత్తదానిలోకి ప్రవేశించే భావన వుండదు.

## ప్రేమ ఎప్పుడూ క్రొత్తది

ప్రేమ సంపూర్ణం అన్నాం. ఎప్పుడూ నూతనమై, పాతదానికి వ్యతిరేకంగా క్రొత్తదనికాదు. అలా అయితే మళ్లీ ఆదిపాతదే. కోర్కె లేకుండ సెక్స్ వుందని ఏమాత్రం బల్లగుద్దినా విలువ లేనిదే. ఆలోచనయొక్క సంపూర్ణ అర్థాన్ని అనుసరిస్తే, బహుశ మరొకటి మీకు తటస్థించ వచ్చు. ఎలాగైనా ఆనందమే కావాలని పట్టుపట్టితే ప్రేమ వుండదు.(TAR-80)

## సెక్సు-తపస్సులు.

దేవుణ్ణి కనుగొనడానికి ఎక్కువ శక్తి కావాలి గనుక, తత్సంబంధమైన మత విషయాల నిమిత్తం కూడ సెక్స్ అదుపులో పెట్టాలనే అభిప్రాయం వుంది. పాపం, చూడండి ఈ బీద ఋషుల్ని, సన్యాసుల్ని, దేవుణ్ణి కనుగోనడానికి ఎంతెంత కఠోర హింసాత్మక నియమాలకు పాల్పడుతారో. దేవుడు - అలాంటి దేదైనా వుంటే- కృశించిన ముక్కలు చెక్కలైన, వక్రత చెందిన మొద్దుబారిన మూర్ఖత్వపు మనసును కోరడు.(Bv-131)

## సెక్సు ఎందుకు సమస్య?

ఎక్కువ మందికి సెక్స్ ఎందుకు సమస్యగా వుంది? ఎందుకు గందరగోళంగ ఘర్షణగ వుంది? మన జీవితాల్లో అది ఎందుకు ఆధిక్యత వహించింది? మనం సృజనాత్మకంగా లేకపోవడమే ముఖ్య కారణం. మొత్తం మన సామాజిక నైతిక సంస్కృతి, మన విధ్యావిధానాలు, బుద్ధిని పెంపొందించడం మీదే ఆధారపడ్డాయి. బుద్ధి పనిచేయడం ద్వారా సృజన జరగదనేది అవగాహన చేసికోవడంలో సెక్స్ సమస్యకు పరిష్కారముంది. బుద్ధి నిశ్చలంగ ఉన్నపుడు మాత్రమే సృజన వుంటుంది. బుద్ధి లేదా మనస్సు పునరుక్తి, జ్ఞప్తి చేసికోవడం మాత్రం చేయగలదు., అది ఎప్పుడూ కొత్త పదాలను అల్లడం, పాతవి తిరిగి సర్దడంచేస్తుంది. మనలో ఎక్కువమందిమి భావించేది, అనుభవించేది మస్తిష్కం ద్వారానే. కనుక మనం కేవలం మాటల మీద యాంత్రిక పునరుక్తి మీద జీవిస్తాము. ఇది ఎలాగూ సృజన కాదు. ఇక మనకు మిగిలిందల్లా సెక్స్ - అదే మన సృజనాత్మకత. సెక్స్ మనస్సుకు సంబంధించింది. మనసుకు సంబంధించింది జరిగితీరాలి లేకపోతే నిరుత్సాహమే మిగుల్తుంది.(ESL)

## సెక్సు - విడుదల

అనేక పక్షాలుగా మనం కట్టుబడి, వుండడం వల్ల సహజంగా సెక్స్ ద్వారానే మనకు విడుదల, ఆ అనుభవం మళ్లీ మళ్లీ కావాలని కొరుకుంటాం. ఎందుకంటే అది క్షణికంగా సంతోష పరిస్థితిని కల్గిస్తుంది; సెక్స్‌పరంగా గాని మరోవిధంగా

గాని ఆనందాన్ని పొందడం, నిల్పడం జరుగుతుంది.

## ప్రేముంటే చాలు

ఇంద్రియజ్ఞానం వీలైన ప్రతి మార్గం ద్వారా వృద్ధి చెందుతుంటుంది. ఆ తరుణంలోనే ప్రవిత్రంగా ఉండాలనే ఆదర్శం పట్టుబడింది. ఆయాదర్శం వ్యతిరేకంగా పుట్టింది. అందుకే వుద్వేగాన్ని రేకెత్తిస్తుంది.

ప్రేమున్న చోట సెక్స్ సమస్య కాదు. ప్రేమలేనితనం సమస్యను సృష్టిస్తుంది.(ESL)

## స్పందన: ఆనందం - అసహ్యం

మనం అసహ్యాన్ని తప్పించుకుంటూ అందంపట్ల స్పందిస్తాం. కాని అసహ్యాన్ని కాదంటూండడం జడత్వాన్ని తెచ్చిపెడుతుంది. యువకుల్లో స్పందనాన్ని వృద్ధి చేయాలి. మనంతకుమనం అందం యెడ అసహ్యంయెడ కూడ చూడాలి. ఆనందాన్ని మేక్కొల్పడానికి ప్రతి అవకాశాన్ని మనం వినియోగించుకోవాలి.(ESL)

## మొండినియమాలే ప్రమాదం

స్త్రీపురుష సంబంధాల గూర్చి కృష్ణజీ భావాలు ఈవిధంగా ఉన్నాయి. అన్ని మతాలు శృంగారాన్ని అణిచివేయమని బోధించాయి. సెక్స్ వల్ల శక్తి వృధా అవుతుందని, దైవాన్వేషణకు శక్తి చాలా అవసరమని అన్ని మతాలు చెప్పాయి. కాని సహజ ప్రవత్తియగు శృంగారాన్ని(SEX) అణచడం వల్ల ఉన్న శక్తి వృధా అవుతుంది. మొండి నియమాలు మనసుపై పనిచేయడం వల్ల కొర్కె జనించినపుడు 'ఏంచేయాలో తెలియదు.

## సెక్స్ సమస్య కాదు

లైంగికానుభూతి పొందడమో లేక విడవడమో తప్ప దానినొక సమస్యగా చేయరాదు. అసలది ఒక చిన్న విషయం. దాన్ని గూర్చిన పూర్వ చింతన, వ్యవహారం, భయం సమస్యలను కారణం. మనసులో మూలమూలన రకరాకాల సమస్యల ద్వార

శక్తి వృధా అవుతుంది. జీవితాన్ని ఇన్ని ముక్కలెందుకు చేయాలి? జీవితాంతం ఏదో ఒక మూల లైంగికానందంతో ఉండడం ఎంతవరకు సబబు? నీకు నీవే ప్రశ్నించుకో?

## వద్దన్నదాన్నే మనసు కద్దంటుంది

ఒంటరితనంగ, బేలగ. నీచంగా ఉన్నపుడు ప్రేమగా వుంటున్నానమకొంటే ఆ ప్రేమ బేలతనాన్ని కప్పిపుచ్చడమే అవుతుంది. ప్రేమ వ్యవహారంలో జొరబడి దాన్నుండి తప్పించుకొవాలనుకోవడం వేరు. అసలు ప్రేమవ్యవహారం జోలికే పోకూడదనుకోవడం వేరు. ఎంచేతనంటే మనం ఏది ఒద్దనుకుంటామో మనసు దాన్నే చేస్తుంది. కనుక ముందుగానే నిర్ణయాలు తీసికోకూడదు. ప్రేమకు భయపడి ఒంటరితనం కోరి, పద్ధతులు పెట్టుకుంటే, ఏకాకై పోతాడు. మానసిక సంక్షోభం వొద్దు. కాని ప్రేమ యెడ గాని, ఒంటరితనం యెడగాని ఉదాసీనత చూపిస్తే మార్పు వస్తుంది. హృదయంలో దాగిన ద్వేషం, క్రోధం మొదలైనవి వాటంతటికి అవి తొలిగిపోతాయి.

## చెరుపు బంధమే గాని అందం కాదు

ప్రేమవల్ల శక్తి వృధాకాదు. అధికారబంధం వల్లనే వృధా అవుతుంది. బంధంలో అసూయ, ద్వేషం, అనుమానం, భయం, భద్రత, ఘర్షణ మొదలగు సమస్యలు పుట్టుకొస్తాయి. ప్రేమ భగవంతుని చేరనివ్వదనే 'పవిత్రులను' సెక్స్ తినివేస్తుంది. ప్రకృతిలోని అందాన్ని కాదని కళ్లు చెవులు మూసేసుకుంటారు. వాళ్ల హృదయాలు పస్తులుపడి వుంటాయి. వాళ్లు ఎండిపోయిన శవాలుగా తయారవుతారు. ఆనందానుభూతి తెలియదు. స్త్రీలో అందముందని, అందులో సమస్యలున్నాయని స్త్రీనే ఈసడిస్తారు.

## శృంగారంతీవ్రమైందికాదు

శృంగార భావాలకు మూలం ఆలోచన. దాన్ని తీవ్రంగా తీసికోరాదు. నీ ప్రేమను వివాహబంధంతో ముడిపెట్ట వద్దు. అందంలేని స్త్రీని పెళ్లాడితే నీకానందం వుండదను కుంటావు. నీమనసు ఇతరుల వెంట పడుతుంది. అందం గల స్త్రీని

పెళ్లాడితే ఆమె మనసు ఇతరుల వెంట పడవచ్చు. అపుడేది దిక్కు? అందుకే సంగీతం ఆలకిస్తున్నట్టుగా, గాలికి కదలాడే ఆకుల సవ్వడి వింటునట్లుగా శృంగార భావాలను గ్రహించు.

## అణచవద్దు దాసోహపడవద్దు

ఒకసారి ప్రసిద్ధ హాలివుడ్ నటి కృష్ణజీని అమాంతంగా ఊహించనిరీతిగా కౌగలించుకుంది. అతడు నిర్ఘాంతపోయాడు. 'ఆమె అంత అందగత్తా? అని ఒకరు ప్రశ్నిస్తే- 'ఆమె ఎంత అందగత్తె అన్నది ప్రధానం కాదు. నేను శృంగార భావానికి వ్యతిరేకినీ కాదు. యువకుల కది సహజం. దాన్ని వేరే దృష్టితో చూడ గలిగితే ...!శృంగారాన్ని అణచవద్దు. దానికి దాసుడవు కావద్దు. పారిపోవుద్దు' అని సలహా యిచ్చారు. చేసి చూస్తే అర్థం అవుతుందన్నారు.

('జె.కె. జీవనదర్శనము' అను గ్రంథము నుండి)

## సృజన-పునరుక్తి-సెక్సు

మనస్సు పునరుక్తి చేయగలదు, జ్ఞప్తిచేసికో గలదు. అది ఎప్పుడా కొత్త పదాలను అల్లడం, పాతవి తిరిగి సర్దడం చేస్తుంది. మనలో ఎక్కువ మంది భావించేది, అనుభవించేది మనసు ద్వారానే. కనుక మనం కేవలం మాటలమీద యాంత్రిక పునరుక్తి మీద జీవిస్తాం. ఇది ఎలాగు సృజన కాదు. ఇక మనకు మిగిలిందల్లా సెక్స్-అదే మన సృజనాత్మకత! సెక్స్ మనస్సుకు సంబంధించిది. మనసుకు సంబంధించింది జరిగి తీరాలి. లేక పోతే నిరుత్సాహమే మిగుల్తుంది. (E.S.L)



# విడుదల - మరణం

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, విడుదల, విముక్తి అనేవి 'ఫ్రీడం' అను భావాన్ని సూచిస్తాయి. వీనిని సందర్భానుసారంగ వేరు వేరుగా వాడతాం. అయితే వాటి మధ్య కొంత అర్థ భేదం ఉంది. రిలీజ్ రిలీఫ్ మొదలగు పదాలు కూడ ఉన్నాయి.

విడుదలను గూర్చి - విస్తృతంగా లోతుగా తెలిసి కోవాలి. ఆ అవసరం ఎంతైనా ఉంది. సామాన్యార్థంలో విడుదలకు బదులు స్వేచ్ఛ అనే పదం వాడతాం 'స్వేచ్ఛ' అంటే 'స్వ+ఇచ్ఛ''. అది విచ్చలవిడితనం కారాదు. అలాగని తెచ్చి పెట్టు కున్న నిర్బంధక్రమ శిక్షణమూకాదు. స్వేచ్ఛ "అన్నా'' విడుదల అన్నా అందులో క్రమత, సమత వుంటాయి. అలాగే స్వ+తంత్రం, తంత్రం అంటే నియమించుకోటం. అదుపుచేసికోటం తనకుతాను అదుపులో ఉండడం. పరాధీనత లేకుండా స్వాధీనంలో ఉండడం.

నిర్బంధానికి లోనుగాకుండ వికాసం కుంటుపడకుండ జంకూ కొంకూ భయం-భీతి లేకుండ, యధేచ్ఛగా వుంటూ వాక్భావక్రియలకు ఆటంకం కలుగజేయని స్థితి విడుదల. మనోవాక్కాయ కర్మలకు సంపూర్ణ స్వాతంత్ర్యం గల స్థితి ఇతరులకు అడ్డు రాకుండుట, తనకు ఆటంకం కలిగిన తొలింగించు కొనుట అందులో భాగం. దానికి అనుగుణమైన నియమాలుపాటించుట కూడ ప్రధానం. ఇది విడుదల యొక్క స్వరూపం.

విడుదల ఎందుకు అనే ప్రశ్నకు సమాధానం చెప్పకనే అవగతం కాగలదు. పెరుగుదలకు వికాసానికి, శాంతికి, సౌఖ్యానికి స్వేచ్ఛ కావాలి మానవత్వం యొక్క సంపూర్ణతకు స్వేచ్ఛ కావాలి. నూతనత్వం వెలుగొందుటకు స్వేచ్ఛ కావాలి. సృజనశక్తి వృద్ధి నొందుటకు స్వేచ్ఛ కావాలి. అవ్యక్తమైంది అవగాహనయగుటకు స్వేచ్ఛ కావాలి. ఉన్నతం, పవిత్రం లాంటివి జీవితంలో సాక్షాత్కారం కావాలంటే స్వేచ్ఛ కావాలి. ప్రజ్ఞ, ప్రేమ, కరుణల నిమిత్తం స్వేచ్ఛ కావాలి.

బంధాల నుండి, నిర్బంధాల నుండి, కట్టుబడిన వాటి నుండి, పట్టుబడిన వాటి నుండి భౌతికంగా మానసికంగా విడుదల పొందాలి. శాఖల నుండి, సిద్ధాంతాల నుండి విశ్వాసాల నుండి, కుల-మత-వర్గ విభేదాల నుండి ఈర్ష్యా ద్వేష అసూయల నుండి

బయట పడుట. నిబద్ధించే జ్ఞానం నుండి విడుదల పొందుట కూడ చాలా ప్రధానం.

చావుకు భయపడేది దేహమా మనసా? దేహం పని చేస్తుంది అనుభవిస్తుంది మనసు ఆయనుభవాన్ని తెలిసికొంటుంది. వివరింపజేస్తుంది. తెలిసి కోవడమే మనసుకు అనుభూతి. అలవాటైన పనుల నుండి హఠాత్తుగా ఆగిపోతే దేహంలో ఏం మార్పు వస్తుందో? ఇక మనసు విషయం- చింతనకు విషయ సేకరణకు అలవాటు పడ్డమనసుకు గతసంపాదనంతా ఏమై పోతుందో ననే బెంగలో పడిపోతుంది. గతంపై ఆధారపడి వేసుకున్న భవిష్యత్ కల్పనలు కూలిపోతాయని కుమిలి పోతుంది. ఈవిధంగా భయాందోళనలు పెచ్చు రెగిపోతాయి.

మరణమంటే ఏమిటో అర్థం చేసికుందాం. దేహంలో ప్రాణవాయువు రాక పోకలు ఆగిపోయి, సకలజ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు పనిచేయక శరీరం రాలి పోవడం మరణం. గుండె ఆగిపోవడాన్ని క్లినికల్‌డెత్ (భౌతికమైన చావు) అన్నారు. జీవితం అంతం కావడం మరణం. ఇది సహజమైంది. అందరికీ సంభవించేది. అయినా చావంటే భయపడుతుంటాం? ఎందుకు?

చావు అంటే ఇంతేనా? చావు జీవితంలో ఒక్కసారేనా వచ్చేది? దాని ప్రభావాన్ని అనేక సార్లు చవి చూడవచ్చునా? అంటే జీవించియుండగానే చనిపోతూ ఉండవచ్చునా? అపుడు చావంటే అర్థమేమి? దానివల్ల నిర్వృతి ఏర్పడుతుందా? జీవిత కాలంలోనే చావు లాంటి స్థితి గతులున్నాయా? కనుక జీవించడం బాగా తెలియడం వల్ల మరణించడం కూడసులువైపోతుందా? ఈ లోతుపాతులు నిశిత పరిశోధన వ్లల గాని తేలవు.

జీవితంలో మరపు అనేది ఒకటుంది. దాన్నే విస్మృతి అంటారు. అది గాఢనిద్రలోను, పూర్తి మత్తులోను సంభవిస్తుంది. ఆస్థితిలో ఏంజరుగుతుంది? అంతవరకు అందినవి పొందినవి, కట్టుకున్నవి, పట్టుకున్నవి. అన్ని సమసిపోతాయి, మరపున పడతాయి. అంటే మనసు పని చేయదు. భయమనేది లేదు కనుక విస్మృతి వల్లమరణ భయం కూడ ఉండదు. విస్మృతి ఒక విధమైన మరణం. ఈ విస్మృతిని మెలకువతో మున్నపుడు కూడ పొందవచ్చునా, మత్తు మందు లేకుండా పొందవచ్చునా? అంటే మనసు వర్తమానంలో పనిచేస్తూ గతాన్ని మరచిపో లేదా?

అలాంటప్పుడు జీవించియుండగనే భయాన్ని వదలుకోవచ్చు కదా! అంటే నిర్భయంగా జీవించడం జరుగుతుంది మరో విధంగా చెప్పాలంటే మరణిస్తూ జీవించడం జరుగుతుంది.

గతాన్ని ఎప్పటి కప్పుడు మరచి వర్తమాన జాగృతిలో మనసు పని చేసి నపుడు మరణ భయం లేదు. క్లినికల్ డెత్ రాకముందే ఎప్పటికప్పుడు సకల బంధాల నుండి తొలిగి, ఆర్జితాన్ని వదలుకుంటూ, నిరామయంగా వుంటే మృత్యు భయానికి తావేది?

## కృష్ణజీ :

### జీవితం - మోక్షం

మోక్షం, విముక్తి, విడుదల, బంధ రహితం, పునరావృత్తిరహితం, జన్మరాహిత్యం, సంపూర్ణ స్వేచ్ఛ అనే పదాలు ఒకే అర్థంలో వాడతారు. ఆ తీరులో మరో పదం కైవల్యం - కేవలత్వం. కేవలస్థితి ; ఒకే స్థితిలో, అదే స్థితిలో, యధార్థ స్థితిలో ఉండడం. మోక్షం, కైవల్యం దైవపరంగావాడతారు. జీవుడు దేవుడిలో లీనం కావడాన్ని మోక్షమనీ, అంటే మళ్ళీ పుట్టులేని స్థితియనీ చెప్తారు. శరీరం ఎలాగూ వదలక తప్పదు. అదిగాక సంసారాన్ని వదలి సర్వేశ్వరుణ్ణి పట్టుకోమంటారు. ఒకటి వదలి మరొకటి పట్టుకోవటమేకదా ఇది! ప్రాపంచిక ఆశలను వదలి భగవత్సం బంధమైన ఆశలు పెంచుకుంటారు. శారీరక సుఖాలను వదలి దైవ సంబంధ మైన సుఖం కావాలంటారు. ఉన్న సిరి సంపదలను వదలి వేరే సౌభాగ్యం ఎప్పుడో పొందాలని ఆకాంక్షిస్తారు. మరొకటి పొందటానికి ఒకటి వదలడం త్యాగమోలా అవుతుంది మోక్షమెలా అవుతుందీ? ఏ ఆశయినా ఒకటే. ఆశ ఉంటే విడుదల ఎలా కుదురుతుంది? ఒక బంధం వదలి మరోబంధం లో పడడం విముక్తికాదు కదా!

### సంపూర్ణ స్వేచ్ఛయే మోక్షం

అయితే దేని నుండి విడుదల పొందాలి? భౌతిక మానసిక బంధాలన్నిటి నుండి విడుదల చెందాలి. మానసికమైన నిబద్ధత నుండివైతొలగడం చాలా ముఖ్యం

అంటే విశ్వాసాలు, సిద్ధాంతాలు, ధ్యేయాలు ఆశలు, అహంకార మమకారాలు వదలు కోవడం నిజమైన విడుదల అవుతుంది. ఎప్పుడో, ఏదో కావాలని చేసే సాధనలు నిజమైన విముక్తి కి దారి తీయవు. సంపూర్ణ స్వేచ్ఛయే మోక్షం- అది ఎప్పుడూ ఉండాలి.

## మరణ భయం - జీవితం

అన్నీ నశించేవనీ, వసంత కాలపు సరిక్రొత్త చిగురుటాకు గ్రీష్మంలో రాలిపోతుందనీ, అదనీ ఇదనీ మరణం గూర్చి సహేతుకంగా చెప్పొచ్చు. చావుకు కారణం చూపొచ్చు. వివరణ ఇవ్వొచ్చు లేక మరణ భయాన్ని ధృఢ సంకల్పంతో జయించ ప్రయత్నించవచ్చు లేక భయాన్నధిగమించడానికి ఒక నమ్మకాన్ని తెచ్చి పెట్టుకోవచ్చు. ఇదంతే బ్రతుకు మిక్కిలిగా సాగించాలనే కోర్కె వల్ల మనసు చేసే పని. అంతః ప్రేరణలుంటాయి. కారాణాలు, ప్రేరణలు, వివరణలు అన్నీ మానసిక క్షేత్రంలోనే వున్నాయి. లేవా? మరణ ప్రక్రియలు. అతిక్రమించడానికి అవన్నీ ఆలోచనా ప్రక్రియలు. కాని మరణ భయాన్ని బుజ్జగింపులతో జయించటం కుదరదు. జాతి, కుటుంబం, అభిప్రాయం, నమ్మకం ద్వారా వ్యక్తి జీవించాలని కాంక్షించడం తానింకా కొనసాగాలనే తాపత్రయమే. కదా?

## మరణించడం

ఈ తాపత్రయాలు, ఆశలు, వ్యతిరేకతలు, అన్నీ స్వచ్ఛంధంగా, అప్రయత్నంగా, ఆనందగా అంతం కావాలి. ప్రతి వాడూ ప్రతిరోజూ తన స్మృతుల పట్ల, అనుభావాలపట్ల, జ్ఞానం పట్ల, ఆకాంక్షల పట్ల, మృతి చెందాలి. ఉప్పొంగటాలు, పశ్చాత్తాపాల కుప్పలు, పుణ్యాలు పోగుచేసికోటాలు క్షణ క్షణం అంతం కావాలి. ఇవి కేవలం మాటలు కావు, వాస్తవాలు. ప్రకటనకు అందని దాని ఆనందం, గతం నిల్పుకోవడం వల్ల లభించదు. ప్రోగాం వేసికోకుండ ఉండడం, ప్రతి రోజు, ప్రతినిమిషం మరణించడం అంటే కాలం లేని స్థితి. ఘర్షణలతో కూడి ఏదో ఒకటి నెరవేర్చుకోవాలనే ప్రేరణ ఉన్నంత కాలం మరణ భయం వుండనే వుంటుంది. (Col II-157)

## జీవితం మరణం ఒక్కటే

బ్రతుకు, చావు అవిభాజ్యమైనవి. వాటిని విడగొట్టడంలోనే నిరంతర భయం వుంది. విడదీయడమే కాలానికి మొదలు. ఒక దాన్ని అంతం చేయడంలోని భయం మరొకటి ప్రారంభించడంలోని బాధకు కారణమౌతుంది. ఈ చక్రంలో మనసు చిక్కుకొని కాలమనే సాలిగూడును అల్లుతుంది. ఆలోచనే ఆ ప్రక్రియ. అది కాలం యొక్క ఫలం. ఆలోచన ప్రేమను కలుగజేయలేదు. (Col II-203)

## జీవించడమే మరణించడం

జీవించడం అర్థమైనపుడు, అంటే అసూయ, ఆదుర్దా, తప్పు, నిస్పృహ తెలిసి వుంది, వాటిని అతిక్రమించి వున్నప్పుడు బ్రతుకు, చావు చాల సన్నిహితంగా వుంటాయి. అపుడు జీవించడమే మరణించడం. జ్ఞాపకాలను, సంప్రదాయాలను జీవించడం జీవించడమే కాదు. ఫలానా విధంగా వుండాలని జీవించడం కూడా జీవించడం కాదు. వాటిని కాదనడమే స్వేచ్ఛ. తెలిసిన దాన్నుండి మృతిచెందడమే స్వేచ్ఛ. అంటే తెలిసిన దాన్నుండి విమోచన, అదే మరణం. అపుడే నీవు జీవిస్తున్నట్లు. ఇది భావాల్తో కూడిన విచిత్ర ప్రపంచంలో జరగదు. వాస్తవంగా జీవించడం అంటే వేదాల ప్రకారం, ఉపనిషత్తుల ప్రకారం జీవించడంకాదు. వాటికి విలువలేదు. రోజూ జీవించే దానికి విలువ ఏమిటి? అదే నీ మొత్తం జీవితం. అది అర్థం చేసికోకుండా ప్రేమంటే ఏమిటో సౌందర్యం అంటే ఏమిటో చావంటే ఏమిటో, ఎప్పటికీ అర్థం కాదు (TNI-205)

## మరణం - నూత్న జీవితం

చనిపోవడమంటే అంతం చేయడం, సాంతంచేయడం, పూర్తిగా అంతం చేసినపుడు క్రొత్తదేదో పుడుతుంది. ప్రతి మానవుడు మొత్తం మానవాళికి ప్రతినిధి. వ్యక్తి చైతన్యంలో మార్పు వస్తే మొత్తం చైతన్యంలో మార్పు వస్తుంది. వ్యక్తి చైతన్యం అంతం కావడమే చావని తెలిసింది. (TWL-211)

## జీవన్మరణాలు కలిసే వుంటాయి!

జీవించడం తెలిసిన వారికి మరణించడం సులభం. మరణించిడం తెలిసిన వారికి జీవించడం సులభం. జీవన్మరణాలు రెండూ తెలిసిన వారు జిడ్డు కృష్ణమూర్తి. జీవిస్తూ మరణించడం నేర్చిన వారికి మరణ భయం లేదు. మరణ బాధ వేరు మరణ భయం వేరు. దేహ సంబంధమైనది మరణ బాధ, మనో సంబంధమైనది మరణ భయం.

జీవన్మరణాలు కలిసే వుంటాయి అనే వినూత్న పరిశీలన జిడ్డుకృష్ణమూర్తి క్షుణ్ణంగా చేశారు. తాను జీవితాంతమూ గత స్మరణలకు స్వస్తి చెప్పి, ఆలోచనను అధి గమించి వుండేవారు. 1986 ఫిబ్రవరి 17 న జీవితం చాలించడానికి సుమారు 2,3 వారాల పాటు దైహిక బాధనను భవించారు. కడుపులో కాన్సరు విపరీతమైన నొప్పి కల్గించింది. కాని మానసికంగా ఎప్పటికప్పుడు ఉత్తేజం పొందుతుండేవారు. ప్రబోధానికి సిద్ధమయ్యేవారు. మానసిక బంధాలనుండి విడుదల పొందిన తటాకంలా నిశ్చలంగావున్నారు. నిశ్చింతగా నిశ్వసించారు. ఆయన మదనపల్లెలో 1895 మే 12 న పుట్టారు. 1923లో లాస్ ఏంజిక్సలో పెప్పర్ వృక్షంక్రింద పరివర్తన చెందారు. 60 ఏళ్లకు పైబడి ప్రవచనామృతాన్ని ప్రపంచానికి అందించారు.



## జీవన్మరణాలు కలిసే వుంటాయి!

జీవించడం తెలిసిన వారికి మరణించడం సులభం. మరణించిడం తెలిసిన వారికి జీవించడం సులభం. జీవన్మరణాలు రెండూ తెలిసిన వారు జిడ్డు కృష్ణమూర్తి. జీవిస్తూ మరణించడం నేర్చిన వారికి మరణ భయం లేదు. మరణ బాధ వేరు మరణ భయం వేరు. దేహ సంబంధమైనది మరణ బాధ, మనో సంబంధమైనది మరణ భయం.

జీవన్మరణాలు కలిసే వుంటాయి అనే వినూత్న పరిశీలన జిడ్డుకృష్ణమూర్తి క్షుణ్ణంగా చేశారు. తాను జీవితాంతమూ గత స్మరణలకు స్వస్తి చెప్పి, ఆలోచనను అధి గమించి వుండేవారు. 1986 ఫిబ్రవరి 17 న జీవితం చాలించడానికి సుమారు 2,3 వారాల పాటు దైహిక బాధనను భవించారు. కడుపులో కాన్సరు విపరీతమైన నొప్పి కల్గించింది. కాని మానసికంగా ఎప్పటికప్పుడు ఉత్తేజం పొందుతుండేవారు. ప్రబోధానికి సిద్ధమయ్యేవారు. మానసిక బంధాలనుండి విడుదల పొందిన తటాకంలా నిశ్చలంగావున్నారు. నిశ్చింతగా నిశ్వసించారు. ఆయన మదనపల్లెలో 1895 మే 12 న పుట్టారు. 1923లో లాస్ ఏంజిక్సలో పెప్పర్ వృక్షంక్రింద పరివర్తన చెందారు. 60 ఏళ్లకు పైబడి ప్రవచనామృతాన్ని ప్రపంచానికి అందించారు.

